ఈ ప్రచురణకు కేవలం ఆర్థిక స్తోమతకలి
గించటం మాత్రమే కాకుండా ఎన్నో విధాల
తోడ్పడిన సహృదయులు శ్రీ శివరామ
కృష్ణ గారికి కృతజ్ఞ తాభివందనములు

సూరి

కాయితాల్లో చుట్టుకొని వొచ్చారట్ట వృందే' అనిఒక్కొ టొక్కటే విప్పటం ప్రారంభించింది.

తీరా నేను ఇంత సరదాతో తెచ్చిన చీరెలు, జంపర్లూ నచ్చు తాయో నచ్చవో ఆమె ముఖంకేసి పరీక్షిస్తున్నా. ఇంతవర కెన్నడూ నే తెచ్చిన వాటికి ఆక్షేపణ రాలా... కాని ఈనాటి కూడా నిలుస్తుందా ఆ మర్యాద!

నా అనుమానానికి తగినట్లుగానే, జార్జెట్ సిల్కు చూసి నవ్వుతూ, "ఇలాంటి చీరెలన్నీ తీసుకురావాలని ఎలా తోస్తుంది మీకు? కండెనూలు అయినా లేదుగదా... కట్టు కోటానికి ఎలాపనికి వొస్తుందనుకున్నారు?"

"నిజమే—కాని, ఇలాంటి చీరెలు— కట్టుకున్నప్పుడు నీ సౌందర్యం ఎలావుంటుందో... చూచి ఆనందించాలని..."

"ఇలాంటి చీరెలు— ఏమిటో నలుగురిలో కట్టుకోవాలంటే 'నామోషీగా' ఉంటుంది. పోనీ అని ఇంట్లో మీముందర కట్టుకుంటే... పది నిమిషాల్లో... అమ్మో! ఊరికే చూసి ఆనందిస్తారు...? మీరు...?" అన్నది. ఆనవ్వులో కొంచెం లజ్జనుకూడా కలిపి.

ఆమె చెప్పినమాట కూడా వాస్తవమే. మరి కిందటిసారి పండగకి వాళ్ళ వాళ్ళు పెట్టిన పట్టుచీర—పది నిమిషాల లోగా నే గా పాతచీరెలా నలిగి పోయింది.! ఎలా మరచి పోతుంది సు—ఆ అనుభవాన్ని?

మూష

ఉన్నదున్నట్లుగా—ఇప్పుడు నేను రాయటానికి ప్రయత్నిస్తే చదివితే అసలంతా వేళాకోళమని అనుకోవచ్చు. నిజమైన నమ్మకాలే ఇంక ఆపూట అన్నపూర్ణా సన్నిధానము. నాన కాశీగా తిర్యాతి చెప్పాలనే ఉత్సాహంతో—

“అంత నీతో చెప్పకూడని రహస్యాలేమున్నాయి నాకు. సు! అంత అనుమానిస్తావెందుకు? నామాటంటే నమ్మకం లేదూ? నేనెప్పుడయినా అబద్ధం చెప్పానా? ఊఁ సరే కాని. ఆకలి వేస్తోంది. ఏం ఈపూట అన్నపూర్ణాదేవి అనుగ్రహం ఎంత సేపటికో!”

“ఏం! అంత ఆకలివెయ్యటానికి కాశీ దేవాలయంలో రంగనాథుని దర్శనం కాలేదు కాబోలు పాపం!”

అని ఛలోక్తిగా విసిరి చెంగున వంటయింట్లోకి వెళ్ళింది.

సృష్టికల్లా అందమైనది, విలువైనదీ... రాత్రిసమయమే. వెన్నెలరాత్రి మరీను. స్త్రీ సౌందర్యం చూడాలంటే, అలాంటి రాత్రి సమయంలోనే చూడాలి. రాత్రి పదిగంటలు దాటిన తరువాత ప్రశాంత సమయంలో ఏ స్త్రీ కనిపించినా, ఏమాత్రపు కళాభిజ్ఞుడయినా – ఆమెలోని రాసిక్యతను– అంతసౌందర్యాన్ని సులభంగా గుర్తించవచ్చు. అంత మనోమోహనమయిన రాత్రిసమయంలోనే వారిమాట మనం వినాలన్నా మనమాట వారు వినాలన్నాను. ఏమంటే మనస్సంతా ఆ కొద్ది నిమిషాలలోపల అనుభవంలోకి రాబోయే మధుర

వాంఛల్లో లగ్నమై యుంటుంది. అలాంటి మధురవాంఛల ముందు ఎలాంటి ఘోర ప్రతిజ్ఞలయితేమాత్రం యేం దూది పింజలలా తేలిగ్గా కన్పిస్తాయి.

వెండిగ్లాసుతో మంచినీళ్లు తెచ్చి, పండువెన్నెల్లో పక్క మీద కూర్చుని ఈనెలు తీస్తోంది సుజాత.

అప్పటికి కప్పుడే నేను పచ్చకర్పూరం మేళవించిన కిళ్ళీ మెసవి, 'త్రీకాజిల్స్' సిగరెట్ టిన్ను అంచులు కోస్తున్నాను.

ఆమె అది గమనించి "నే నెలాంటి తాంబూలం యిచ్చినా మీకు జేబుల్లో తెచ్చుకున్న కిళ్ళీమాత్రం చెయ్యదు కదా"

"అది కాదు సు! నువ్వు యిల్లంతా సవరించి శయ్యకు చేర్తే సరికి పదా ఠా తేకి మూసవలసిందేగా! అంతవరకూ తాంబూలం కోసం... వేచివుండే ఓపిక లేక ముందు ఈ కిళ్ళీ...అంతే కాని నీ తాంబూలంమీద అశ్రద్ధకాదు" అంటూ ఆమె అందించిన ఆకులు వేసుకుంటున్నాను.

"మీ మాటలు మరీ విచిత్రం సోదుహూ! పదిగంటలయిందో లేదో...అంత మరీమెండదారాళే...అబ్బ! యెలాపడుకోవటం?" అంటూ పమిటచెంగు చాటున పెదిమల మీద సిగ్గు దాచుకుంది.

నేనూ ఆజానకాశాన్ని, పురస్కరించుకుని - వలదని వారించి నా తాంబూలంలో సగభాగం ఆమెకు పంచియిచ్చాను, అర్ధాంగికదూ మరి?

ఆను

"చాల్లెండి...మరీ చిన్నతనం. దగ్గరకు రావటం భయంకదా!– సరేకాని నిజంచెప్పండి! అసలు ఆచీరెలా అవి యెందుకు తెచ్చినట్లు?

"ఎల్లుండి రాత్రికి మీ తమ్ముడి పెళ్ళిట సు! మీ నాన్న ఉత్తరం రాశారు. బహుశః తెల్లవారేసరికి మీ అన్నయ్య కూడా వొస్తాడేమో?"

"నిజం! మరి ఇందాకట్నుంచీ, నాతో చెప్పాయినా చెప్ప లేదేం? అమ్మదొంగా! అబద్ధాలుకూడా నేర్చుకుంటున్నావూ!" అంది సంతోషంలో నాబుజాలువూపుతూ...

నేను వెళ్ళొద్దు అంటే, పాపం, ఆమె సంతోషాన్నంతా హరించిన వాణ్ణి అవనూ! అయినా మనస్సులోని విచారాన్ని బిగపట్టి లేని సరదా కల్పించుకుని,–

"ఊఁ హూఁ. అదికాదు సు! ఇందాకనే చెపితే పెట్టె అంతా సర్దుకుని దేవిగారు ఈరాత్రి ప్యాసెంజరులో నే ప్రయాణమౌతా రేమో అని భయమేసింది" అన్నా కొంచెం ఉడికిలించాలని.

సాధారణంగా మనం ఆడవాళ్ళను ఉడికించాలన్నా, వారికి హుషారుగా కోపం తెప్పించాలన్నా ఎక్కువ సరదాపడతాం. ఆప్రణయ కోపమే నిజంగా ఎంత అందంగా కన్పిస్తుంది? కాని ఆ చిన్నిమాటే ఒక్కొక్కప్పుడు వారి మనస్సుకు బాధను కూడా కలిగిస్తుంది. సమయా సమయాలు గుర్తించకపోయినా లేక పెడసరంగా అన్నా...

"నిజమే! పాపం! నేనెప్పుడూ పుట్టినింటి దగ్గర్నుంచి ఉత్తరం రాకపోతే ఎప్పటికీ నా ప్రయాణానాపేనన్నానుకున్నారా...? ఎందుకీ కాని మాటలు? అదీ గాక మీరూ నాతో వచ్చేప్పుడు ఎప్పుడు ప్రయాణం అయితేనేమాత్రం ఏం?" అన్నది అభిమానాన్ని నా కళ్ళకి పెనవేసి.

"అది కాదు సు! ఊరికే మాటవరసకి అలా అంటే, అంతలా తప్పుపడతావేం? అసలు నాకు నీ అనుజ్ఞలేకుండా నే చిన్న పొరపాటుచేశాను. క్షమిస్తావా?" అన్నాను ఆమె అధరాన్ని నొక్కుతూ.

"క్షమించాలా! క్షమించటానికి కూడా విలువలేని పొరబాటు చేశారేమో! అలా అయితే శిక్షిస్తాను. కాదు నాకలా విలువ వుంటే అలాచేస్తాను. త్వరగా చెప్పండి మరి!"

"నాకు ఈ ప్రయాణానికి శెలవుదొరకదని, నిన్ను తీసుకుని వెళ్ళటానికి మీ అన్నయ్యను రమ్మని నేనే టెలిగ్రాం యిచ్చాను. ఏం? కోపమా? నిన్ను అడగకుండా ఇలా చేసి నందుకు?"

"నిజంగా శిక్ష వేయాల్సిన నేరమే. కాని ఈసారికి క్షమిస్తాను. మీకు శెలవుదొరక్కపోతే నేను మాత్రం యెలా వెళతా ననుకున్నారు? అంత అమాయకులేం, యింకా మీరు? పోనీ నేనే మానేస్తాను. ఈనాటికి ఇద్దరమూ మానేద్దాం." అన్నది తాపీగా!

ఎనిమిది

నాకు నవ్వొచ్చింది. ఎవరు అమాయకులు? తమ్ముడి పెళ్లి అయితే వెళ్లమన్నా వెళ్లనని పిచ్చిపిల్ల మొక్కుబడయినా వుంటుందీ?

"ఆడపడుచువి; నువ్వు వెళ్లకపోతే పెళ్లి ఆగిపోదూ! పైగా కావలసినన్ని ఆడపడుచులాంఛనాలు పోగొట్టుకుంటావా వృథాగా? అసలు ఈమాటలన్నీ మీ అన్నయ్య ముఖం కన పడేటంతవరకేగా? ఆతర్వాతకూడా జ్ఞాపకముంటాయా? నే వద్దంటే మాత్రం మానేవా అప్పుడు? నాకీ వెళ్లేప్పుడు చెప్పి అయినా వెడతావా?"

ఈ ప్రయాణాన్ని గురించి సుజాతమనస్సు ఎంత బాధపడు తుందో తెలుసు. నాకు తెలుపకపోయినా, అన్నగారు వొస్తే ప్రయాణం తప్పదని. అయినా మననైజగుణం ఎలా మరచిపోతాం? ఆమె మనస్సు నామాటలతో ఉడుకెత్తి పోతుందేమో అన్న ఆలోచనను రానీయలా. తెలిసికూడా ఒక్కొక్కప్పుడు ఆడవాళ్ల విషయంలో ఇలా అజ్ఞానంగా ప్రవర్తిస్తాం. మన మనస్సు ఏవిషయాన్ని గురించి బాధపడు తున్నావాళ్లు మనలాగ ఇంత ఉడికించరు. చేతగాక కాదు. మనమనస్సు మరింత బాధపడటం యిష్టంలేక. కనుకనే అలాంటి సమయంలో మనమనస్సు శాంతిపరచి – బాధలో సగం తాము పంచుకుంటారు.

తోమ్మిని

"ఎందుకు నా హృదయాన్ని ఇంకా అంతలా మధిస్తారు? మన స్ఫూర్తిగా అనుకున్నమాట కాదా అది? ఆడపడుచు లాంఛనాలమీద మోజు ఏ దేవిషయంలోనూ లేదూ నాకు...? మీరు బజారునుంచి ఏరోజయినా రావటం రవంత ఆలస్యమయితే నా మనస్సు ఎంత ఆరాటపడుతుందో మీకు మాత్రం తెలియదూ?...మిమ్మల్ని విడిచి వెళ్ళటం ఎలాగా అని ఒకవైపునా, పోనీ అని మానేద్దామా అంటే, 'ఒక్కగా ఒక్క ఆడపిల్ల; అయినా శుభమా అని తోరణం కట్టుకుంటే సంప్రదాయానికి నాకటానికి నోచుకోలేదు, ఇహ నేనయినా చేసే శుభకార్యాలు ఏమున్నాయి?' అని మా అమ్మ గుజగుజలాడుతుందేమో అని ఒకవైపున; ఎటూ తోచక నేను బాధపడుతూంటే; ఎందుకు ఇలాంటి మాటలన్నీ అని నన్ను మరింతబాధపెడతారు? పోనీ నాలుగురోజులయినా శెలవు దొరకదూ? అబ్బ!...మిమ్మల్ని విడిచి వెళ్ళలేనండీ!" అని నా కౌగిలిలోకి వాలింది.

శెలవు దొరకదని ఖచ్చితంగా తెలుసు నాకు. ఆ సంగతి ముందుగానే చెబితే నేనసలు శెలవుకోసం ప్రయత్నించ లేదనుకుంటుంది. అవునుమరి! ఉత్తరం వొచ్చిన వ్యవధానం మాత్రంయేది? పోనీ ఇలా అని ఇప్పుడే చెప్పి – నువ్వుకూడా వెళ్ళకపోతే ఏం బావుంటుంది. ఈ తఫాకు వెళ్ళిరా ఎలాగో అలా అని బలవంతం చేశామూ అంటే – విధాయకం గనుక –

'నేను వెళ్ళకపోతే మనసులో యేమయినా బాధపడతా
నేమో అని మాట వరసకు వెళ్ళమనటమే కాని – నిజానికి
యిష్టమయితే మీరు మాత్రం ప్రయాణంకారూ!' అనీ అన
వచ్చు 'సీరియస్'గా...

మన బలవంతం యెందుకని తటస్థంగా ఊరుకున్నామా అంటే–
"మాటవరసకు పోనీ నేను మానేస్తాను –అంటే తామూకూడా
మెదలకుండా ఊరుకున్నారు నే అన్నదే చాలుకదా అని.
వారి అవసరాలు వారివే కాని, ఇతరుల అవసరాలుకూడా
తమ అవసరాల లాంటివేనని గ్రహించలేరు సుమీ కొందరు'
అనీ అనవచ్చు కొంచెం కోపంతో...

అందుకనే ఆడవాళ్ళముందర యే విషయం మాట్లాడాలన్నా
తూచి మాట్లాడాలి. మాట్లాడటంలో సూదిమొన వాసి
అటుకాని ఇటుకాని తిప్పి మాట్లాడామా అంటే, నవనీత
మనస్కులు కదండీ! వాళ్ళ మనస్సు వెన్న కరిగినట్లు కరిగి
కన్నీళ్ళరూపం ధరించి, వారి పైటచెరుగు, అదృష్ట వంతుల
మయితే మనంకూడా తడిసి ముప్పందుం కావాలిసిందే...

'రేపు శెలవుకోసం ఎలాగయినా అన్నివిధాలా ప్రయత్నిస్తాను.
ముందుగా ఎందుకు బాధపడటం? తర్వాతాలోచించుకోవచ్చులే'
అన్నా, ఆమె తల్లోని మల్లెపూలవాసన మనస్సును హరి
స్తూంటే ఆ పండువెన్నెల అందాన్నికూడా ఆపూల సౌరభ్యం
తోపాటు అనుభవించాలనే ఆదుర్దాలో.

అవును. అవసరమయిన విషయాలు_నేను యేవి మాట్లాడుతున్నా మీకు నిద్రవస్తూనే వుంటుంది. స్నేహితులెవరైనా వచ్చినప్పుడు - ఎంత చలిగావున్నా రాత్రి ఒంటిగంటవరకూ కృష్ణ ఒక్కన కూర్చుని బాతాఖానీ వేస్తుంటే - కునుకైనా రాదుకదూ!'

అని సన్నగా విసిరింది నామీదికి, ఎప్పుడో సత్యంవొచ్చిన నాటి నేరాన్ని ఇప్పుడు అస్త్రంగా మార్చి.

ఆడవాళ్లు మన నేరాలు అన్నీ 'ఫైల్లో' జాగ్రత్త చేసినట్లు గుర్తుపెట్టుకుని సమయం వొచ్చినప్పుడు వాటిని అస్త్రాలుగా మార్చి విసురుతారు. మనం సమయాసమయాలు గమనించకుండా అనేస్తాం సాధారణంగా.

తెల్లవారేసరికి అయిదుగంటల ప్యాసింజరులో అవ్వాయి చువ్వలా ఊడిపడ్డాడు మా బావమరిది. ఇహ నెలాగయినా తన ప్రయాణం తప్పదనే అధైర్యం కలిగింది సుజాతకు.

నాకు ఆరోజల్లా అసలు యిల్లు కదలటానికే మనస్కరించలా ఈ శెలవుకోసమని తప్పించడకాదు కదలటం! ప్రత్యక్షంగా పై ఆఫీసరు వొస్తాడని నోటీసు వొచ్చినప్పుడు- తోటి ఆఫీసరుతో ఎలా సర్ది చెప్పుతాం. పైన రాసినా 'శాంక్షన్' అయివొచ్చే వ్యవధానం మాత్రం యేది?

అలా ఆలోచిస్తూ నే యింటికి వొచ్చేసరికి, డాబామీద రీడింగ్ రూమ్‌లో కిటికీదగ్గర కూర్చుని వుంది సుజాత. ఉదయంనుంచీ

పక్కింటు

చొక్కా తొడుక్కోవడం కూడా చిన్నపిల్లలకు చెప్పినట్లు చెప్పడం ప్రారంభించింది.

'నేను వారంరోజుల్లోనే తిరిగివొస్తా. నేను ప్రయాణం మానేస్తానేమో; పంపలేదనే నెపం మీ మీదకు వొస్తుందేమో అని అలా ధైర్యంగా వున్నట్లు నటిస్తున్నారు. కాని నే వెళ్ళిన దగ్గర్నుంచి మీ రెంత దిగులు పడతారేమోనని భయపడుతున్నా. నాకు ధైర్యంగా చెప్పటంకాదు. ఈవారం రోజులూ మీ రెంత ధైర్యంగా ఉంటారో తెలుస్తుందిగా! సరిగ్గా వారం అయే సరికల్లా వీలయితే శెలవు పెట్టిరావటమో, వెంటనే పంపమని టెలిగ్రాం యివ్వటమో చేయండి. లేకపోతే– మా వాళ్ళు పదహారురోజుల పండుగనీ, అది అనీ – ఇది అనీ నా ప్రయాణాన్ని సాగనివ్వరు. ఏం? అలా చేస్తారుకదూ! దిగులు పడవద్దుసుమా' అని ధైర్యం చెబుతూ, ఒక్కటొక్కటే అప్పగింతలు ప్రారంభించింది.

నా ధైర్యమంతా సడలిపోయింది. తలచుకుంటే అంతా యేమిటోలా తోచింది. నిజమే! ఎక్కడో నూటయాభై మైళ్ళ దూరంలో జన్మించిన స్త్రీ, ఎన్నడూ కలలోనయినా ముఖ పరిచయం లేని స్త్రీ ఆ అయిదేళ్ళనాటి జూన్ నెలలో ఆమె మెళ్లో మూడుముళ్లూ వేసినంతమాత్రాన, ఇప్పుడు నన్ను విడిచి తన తల్లితండ్రులను చూడటానికి వెళ్లాలంటేనే ఇంత బాధపడుతోందీ అంటే – ఏమిటోలా తోచదూ?... మరి

ఆదంపతులకు ఎన్నిరకాల ప్రణయకేళీలకు – శృంగార రసక్రీడలకు – జ్ఞాపక చిహ్నంగా, ఫలితంగా సుమించిన కుసుమమేనా సుజాత – పదహారేండ్లవరకూ కూడా క్రిందపడితే ఆరిపోతుందేమో అన్నంత వాత్సల్యంతో – పెంచిన తల్లిదండ్రుల దగ్గరకు ఒక్కనాడూ నన్నువిడిచి వెళ్ళలేక పోవటానికి కారణం? ఏమిటి ఈసంబంధం? జన్మాంతర మందు కూడా ఇలాంటి సంబంధ మేదయినావుండి, అదే అనుశృతం గావొచ్చేసరికి ఈజన్మలో ఇలా అద్వైతంగా మారుతుందా? లేక నేనానాడు వేసినమూడు ముళ్ళవల్ల కలిగిన సంబంధమే కారణమన్నా, ఈ అయిదేళ్ళవల్ల ఏర్పడిన సాహచర్యమే కారణమన్నా మరి అందరు ఆడవాళ్ళు ఇలాగే వుంటున్నారా లోకంలో!

నాకూ కళ్ళు చెమ్మగిలాయి. పోనీ అని నేనుకూడా బయల్దేరితే? రేపు పైఅధికారికలం మరినన్ను గురించి రిపోర్టులో ఎన్ని వంకర గీతలు గీస్తుందో! అబ్బ... ఇలాంటి స్థితిలోకూడా మనస్సును బిగపట్టి, పై అధికారికి విధేయతగా ప్రవర్తించాలంటే అదికూడా ఒక విధంగా దురదృష్టమే.

ఆరాత్రి మాఆనందాన్ని ధ్వంసం చెయ్యటానికి ఇష్టంలేక కాబోలు నిద్రాదేవి మాప్రాంతాలకు రాలేదు. నిద్రాదేవికి అనుగ్రహం కలిగినట్లే ఏ దేవతల కయినా అనుగ్రహం కలిగి ఆరాత్రిని తెల్లవార కుండాచేస్తే...!

పదునైమ

మనస్సులోని ఆలోచనలన్నీ మాయమయినాయి. ఏదో కొత్త ఉత్సాహం. కొత్తశక్తి, తెలియని తెంపరితనమూ ప్రవేశించాయి నాలో.

పచ్చజెండాకూడా ఊపేశాడుగార్డు. సుజాత కళ్లల్లో నీళ్ళు జలజల రాలాయి నాచేతిమీద వేడిగా.

రైలు ఫ్లాట్‌ఫారంమీదనుంచి సన్నగ పాకుతోంది! రైలుతో పాటు నేను అడుగులు వేస్తున్నాను సుజాత చెయ్యి వదల కుండానే.

ఫ్లాట్‌ఫారం మరో పది అడుగులువుంది. ఎడమచేతివైపున వున్న ఒక్క చేత్తోనే తీసి, నేనూ రైల్లో ప్రవేశించాను. వెళ్లిపోతున్నాడు మా బావమరది, ఆనందాతిరేకంలో ఉక్కిరి బిక్కిరి అవుతోంది సుజాత!

"మరి పై అధికారి వొచ్చి నిన్నుగురించి రిపోర్టులో ఎన్ని వంకరగీతలు గీస్తాడో!" అంటున్నావా?

"ఆ క్షణంలో నాకు ఈ ఉద్యోగమూ, సద్యోగమూ ఏదీ గుర్తుకు రానేలేదు. అదీగాక నేనూ, నా సుజాత ఏకమై ఒక్కగీతమీద నడుస్తున్నప్పుడు, కేవలం డబ్బుకోసం శరీరాన్ని అమ్ముకునే వేశ్యలవలె నయినా కాకుండా, జీతంకోసం మనస్సునుకూడా అమ్ముకునే ఆఫీసరే అయి, నామనస్సును తెలుసుకోకుండా, నామీద యెన్ని వంకరగీతలు గీసుకుంటే మాత్రం నాకేం లెక్క...?

# అపేక్ష

ఎంత ఇష్టమూ లేకపోతే, ఆ పంకజమల్లిక్ రికార్డును ప్రొద్దున కొనుక్కొని వచ్చిందగ్గర్నుంచి అన్నిసార్లు పెడ తాడా మా చంద్రం.

మళ్ళీ వినిపిస్తోంది - అదేపాట - వెనక గదిలోనుంచి.

"కౌన్ - తుఝే - సమ్ఝా వే-"

వెన్నెలకాంతి మాత్రం మీదపడేట్లుగా - మేడమీద వరాం డాలో 'ఈజీ ఛైర్'లో కూర్చుని - మత్తుగా సిగరెట్టు కాలుస్తూ వింటున్నా.

ఎన్నిసార్లయినా ఆ మల్లిక్ రికార్డులు పెట్టడానికి వాడికీ విసుగులేదు. వినటానికి నాకూ విసుగులేదు.

దమ్ముచాలక - చేతిలోని సిగరెట్ ముక్కను నిర్లక్ష్యంగా విసరిపారేసి ప్రక్కకుతిరిగి మరో సి[illegible]రెట్‌ను అందుకోబోయే సరికి అక్కడేవుంది ఆ పువ్వు

ఎక్కడినుంచి వచ్చింది ఆపు[illegible]

ఏ గాలి విసురుకైనా కొట్టు[illegible]ందా? ...

ఎలావౌ స్తేయేం! చూట్ట[illegible] అందంగావుంది ఆపువ్వు.

కాని ఏం పువ్వో పోల[illegible]న్నాను.

అంత అందమైన పువ్వు - అంత వాసన వెయ్యటంలా. అలాంటి పువ్వును ఎక్కడా చూసినట్లు జ్ఞాపకం. ఏ బొమ్మల్లో నైనా చూశానేమో! తేరాచేసి కాగితంపువ్వు కాదుకదా! ముందుకు వంగి దాన్ని అందుకో బోయేసరికి వెనకాలనుంచి ఎవరో వీపుమీద చరిచారు.

ఉలిక్కిపడి చూచాను.

ఎవరోకాదు మా చంద్రమే...

ఏం పువ్వో తెలుసా అది?...అంత ఆప్యాయంగా అందు కుంటున్నావు?

అదే నాకూ సందేహం. ఏం కాగితంపువ్వా? అయినా ఎంత అందంగావుందో చూశావా? కొట్టివాసనవుండే పూలజాతికి చెందిన పువ్వు ఏదయినా నేమో?

అయినా తీసుకుని వాసనచూస్తే తెలుస్తుందిగా!

మళ్లీ అందుకోబోయాను.

వాడు ఆ పువ్వువంక పరీక్షగా చూసి,

“ఇదా? ఇది ఒట్టి పనికిమాలిన పువ్వు. అందంచూసి మురిసి పోతున్నావేమో? దాని కసలు వాసనేవుండదు. నేనిలాంటివి చాలాచూశాను. అన్నట్లు ఈమధ్య వసంత్ –”

“నేనా?”

“వసంతంటే నువ్వేనేరా? ఏంతమంది లేరు లోకంలో” అంటూ సిగరెట్ వెలిగిస్తున్నాడు. ఇంత సౌందర్యంగా వున్న

పువ్వుగూడా పనికిమాలిందేనా? నాకాశ్చర్యం వేసింది. కానీ పువ్వు వాడిపోయిం తర్వాత కాస్తయినా వాసన వుండకూడదా వుండదా? పువ్వులుకూడా ప్రాణాలు తీస్తా యంటారు. అయినా నాకా పువ్వుమీద ఆపేక్ష తగ్గలా. అయినా వాడేం చెస్తాడో అని...

"ఏమిట్రా ఆనసంత్...?"

"వాడూ నేనూ ఇలాగే కూర్చుని వోనాడు—ఏదో మాట్లాడు కుంటున్నాం. ఈపువ్వులాగే నో పక్కని అమ్మాయి ప్రత్యక్ష మయింది అక్కడ."

సాధారణంగా ఆడవాళ్ల విషయం వొచ్చిందంటే అసలు ఫాయిదాలతో తెలుసుకోవాలనే ఆసక్తి అందరికీ వుంటుంది. అలాగే నేనూ రవంత ఉత్సాహంతో...

"ఊరికే ఎందుకు వస్తుందిరా? తగినంత కారణం లేందే. చెప్పదలచుకున్న దాంట్లో మళ్లీ దాపరికమెందుకు? ఎవరి అమ్మాయో; అలా ధైర్యంగా ఎలా వొచ్చిందో...సమ గ్రంగా తెలవియ్యి మరి..."

"ఎందుకు వొచ్చిందో ఆమెకే తెలియాలి. కాని వాడికి మాత్రం తెలియదు. వాడిసంగతి తెలియనిదేముంది? అసలు ఆడవాళ్లంటేనే హడలు. ఎందుకొచ్చినా వాడికోసమే వచ్చిందని స్పష్టమే కదా!"

"అసలు ఇంతకీ ఎవరమ్మాయో – చెప్పావుకాదు..."

"ఈవీధి చివర ఆనందరావుగారు అని లేరుత్రూ. ఈమధ్య రేడియోకూడా కొన్నాడు...!ఆయనకూతురు పంకజం..."

"ఆ అనాఘ్రాత పుష్పమా?"

"ఆపేయ్ కవిత్వం మాట్లాడక...అసలు కథ వినదలిస్తే విను. ఆయనకూ మనవాడికీ మొట్టమొదట క్లబ్బులో పరిచయం. అంతకన్న పిల్లకేమిటిలే స్నేహం ఈడా? జోడా?"

"సరేలే...నేనూ వెళ్లానురా వాళ్ళింటికి రేడియోకోసం"

"ఇహానేం? వాడూ అంతే...ఆయన రేడియో కొన్న దగ్గిర్నుంచీ వీళ్ల పరిచయం మరింత ఎక్కువయింది. వాడికీ నీలాగేనే బెంగాలీ సంగీతం అంటే మహాచెడ్డయిష్టం. రవంత తీరిక చిక్కిందంటే రోజూ వెళ్ళటం... సంగీతం వినటం మామూలయింది. అదీగాక ఆదివారం ఆదివారం పంకజ మల్లిక్ సంగీతపు పాఠాలు వుంటాయటగా రేడియోలో... వాటికి హాజరవుతూ వుండేవాడు వసంత్...

ఆనందరావుగారుకూడా – వసంత్ వెళ్ళినప్పుడల్లా, సమయాన్నిబట్టి – టీ – కాఫీ – టిఫెన్‌లతో సత్కరించి, పిచ్చాపాటీ మాట్లాడుతూండేవాడు. వసంత్ వెళ్ళటంవల్ల వాళ్లు విసుగ్గా 'ఫీ ల'వకపోవటమే కాకుండా సరదాగా వున్నట్లుండేవారు. క్రమంగా పరిచయం అతి చనువుగా మారటంవల్ల ఆనందరావుగారు ఉన్నా లేకపోయినా మనవాడు 'రేడియో'

కోసం వెళ్ళుతూనే వుండేవాడు, తనే స్వయంగా రేడియో పెట్టుకుని విని వస్తూండేవాడు.

ఒకనాడిలాగా సాయంత్రం అయిదయ్యేసరికల్లా వసంత్ మామూలుగానే వెళ్ళాడు వాళ్ళింటికి. రేడియో సెట్ వున్న టేబిల్ మీదనే వెండిప్లేట్లో 'మాపిల్సా' కప్పులో కాఫీ... తమలపాకులూ మొదలయినవన్నీ అమర్చి వున్నాయి.

కొత్తగా వొచ్చిన యే బంధువుకోసమో, అలా అమర్చివుంటారని అనుకుని వాటిని కొంచెం అలా ప్రక్కకు సర్ది... ప్రోగ్రాం పెట్టుకున్నాడు.

"మద్-భరీ-ఋతు-జవాని-హై" సర్తకీలో రికార్డు విని పిస్తోంది.

ఇంతలో ప్రక్కగదిలోనుంచి అయిదారేళ్ళ కుర్రవాడు వొచ్చి "అవన్నీ అలా దూరంగా నెట్టేశారేం? మీకోసమే నండీ?" అన్నాడు.

ఆ కుర్రవాడి మాటలకు ముద్దొచ్చి, చెయ్యిపుచ్చుకుని బుగ్గలు పుణుకుతూ "ఎవరు చెప్పారండీ!" అన్నాడు.

"అదుగో! మా అక్క..." అని కిటికీవైపు వేలుచూపించి అతడి చేతుల్లోంచి తప్పించుకుని పారిపోయాడు.

అతడు కొంచెం తలపైకెత్తే సరికి ఆ అమ్మాయి సిగ్గుతో కళ్ళను నిండించుకుని...కొంచెం తలవంచుకుంది.

ఆ అమాయకుడు - మొదట ఇదంతా గ్రహించ లేక పోయాడు. క్రమంగా, కన్పించిన వాళ్ళంతా అన్యాపదేశంగా యాగీ చెయ్యటంచూసి సహించలేక పోయాడు. నిజానికి తన తప్పు యేమీ లేకపోయినా లోకం - యెలా విశ్వసిస్తుంది? ఎంతో అభిమాన పడ్డాడుకూడా. క్రమంగా—"

నాకు మరింత జిజ్ఞాస కలిగింది.

"మరి ఆనందరావు గారికి మాత్రం యిలాంటి అపనిందలు రాలా? పోనీ అని ఆయన ఉపేక్షచేసినా పంకజం తల్లి అయినా కూతుర్ని మందలించలేదు?"

"ఎందుకు మందలిస్తారు? చూసీ చూడనట్లు వినీ విననట్లు వూరుకున్నారు. ఆ అమ్మాయి ప్రయత్నం నెరవేరితే వాళ్ళకీ కొంతహాయి! సగం బెడదకూడా తీరిపోతుంది..."

"నువ్వు చెప్పేది నాకర్థం కావటంలేదురా చంద్రం: చెప్పేదాంట్లో మళ్ళీ కొంత దాపరికం యెందుకు? స్పష్టంగా చెప్పు. పంకజానికి అంతవరకూ పెళ్ళి కాలే దన్నమాట."

"పెళ్ళా...!" అని ఆశ్చర్యంగా నావైపుచూసి, "పెళ్ళీ— పెటాకులూను, ఆ అమ్మాయి తల్లి యెలాంటిదో తెలుసా? పాండవ పట్టమహిషిలాగా ప్రసిద్ధి కెక్కిందిరా?..."

"సరే... ఇంతేకదా! ఆమె మహాపతివ్రతలాగానే చెలామణీ అయింది! ...అలాగే చాటునో మాటునో యిలాంటి గొడవలు చాలా సంసారాలల్లో సహజమయి పోతున్నాయిగా"!

"సంసారా లేమిటోయ్... చట్టుబాడలు, ఆమె అసలు సంసారిణేకాదు."

"కాకపోతే సాని అయినదాన్ని గురించి యింత సంఘర్షణ యెందుకురా!"

"ఎందుకా? సానికాని స్వైరిణి కనుక. ఏగాలిపాటునో ఆనంద - రావు దగ్గరకుచేరింది పంకజం తల్లి. ఆగాథంతా మళ్లీ యిప్పు డెందుకులే? ఏభైనిమిది దేండ్లనుంచి అతడి దగ్గరే స్థిరపడి పోయింది. చేసుకున్నవాడు చిన్నప్పుడే పోయినా ఇతడి దగ్గరకు వొచ్చేలోగా కొన్ని చేతులు మారింది- చీట్లాటలోని జోకరు ముక్కలాగా. జోకరు వొచ్చినవాడికి పంట పండినట్లే... ఆమె వొచ్చినా అంతోయింతో ఆమెసొమ్మ వీళ్లకుకూడా కలిసి వొచ్చేది. ఇప్పుడీ ఆనందరావుగారి ఐశ్వర్యం అంతా ఆమెపాపతే. ఈ రేడియోకూడా ఆమె కాతాలోదే...

ఈచేతులు మారటంలో ఎక్కడ పుట్టిందో మరి పంకజం! కన్నతల్లికి తెలియాలిసిందే... డబ్బుకు లోటులేదు కనుక పంకజానికి - చదువుసంగీతాలు శ్రద్ధగా నేర్పించారు. నిజానికి పంకజం కేవలం అందకత్తె మాత్రమే కాదు - చురుకైనదీ- తెలివైనదీ అని కూడా వినికిడి. తల్లి సంగతి - ఆవొచ్చిన కొత్తలో విస్తారంగా చెప్పుకున్నా, ఈమధ్యలో ఆకథంతా పాతబడి, మళ్లీ పంకజం వయస్సుతోపాటు ఆపాత పురాణం బయట పడింది."

"మరి పంకజం మాత్రం అత్తల్లికి కూతురుకాదా?"
—నేనే వసంత్ లాగా 'ఫీల'యినట్లు ఆవుర్దాగా ప్రశ్నించా.
"ఎంత తెగించినవాడి కయినా అదే అనుమానంరా! సంఘసంస్కారాలంటే ఆపేక్షకలవాళ్లే ఎవరైనా పెళ్లి చేసుకోకపోతారా? అని అనుందరావు ఎంతో ప్రయత్నించాడు. ఆ స్త్రీకోసం. అందంకోసం అనేపటి మొదటినుంచా ప్రయత్నించినా— ఏదో రహస్యంగా కొన్నాళ్ళు 'ఎంజాయ్' చేసుకోటానికేగాని, మూడు ముళ్లూ వెయ్యటానికి మొగాడు వొప్పుకోలా. అలాగని [illegible] ఏమైనా ఒక వేళ ఒప్పుకున్నా – [illegible] చూడాలి. [illegible] ప్రమాణకన్ని చేసుకోటాని కెలా అంగీకరిస్తుంది?"
"ఏ మంటుంది మరి?"
—మళ్ళీ నా దృష్టి పుస్తకానికి [illegible] లాగా – [illegible] తున్నాయి.
"ఏమంటుంది! వసంత్ ను తప్ప మరొకర్ని చేసుకోనంటుం దిట. అతన్నే మనసారా ప్రేమించిందట. తనలాంటి ప్రేమ సీమలు చాలా చెయ్యిస్తుందిట. తన తల్లి ప్రవర్తనకూ తనకూ సంబంధం లేదట. తల్లి అలవాట్లే కూతురుకుకూడా కొన్ని వుంటా యనుకోవడం – శుద్ధ తెలివితక్కువట."
"మరి ఆ వసంత్ యేమన్నాడు?"

"ఆ వసంతే అన్నమాటేమిటి? నిజానికి నువ్వేమాత్రం చేస్తుంటావు?... క్రమంగా రాకపోకలు తగ్గించాడు. లేక పోతే రేపు నలుగురిలో తలెత్తుకుని ఎలా తిరుగుతాడు?"

... ... ...

"వసంత్ రాకపోవటానికి కారణం తన తల్లి – ఆనంద రావుగా అనుకోటాన్ని బట్టి గ్రహించుకుంది. అతడు మొదట్లో జంకినా, తనకు తానై ఎదుటపడి – తన కోరికను తానై తెలియచేస్తే, శుద్ధ ప్రవరుడి లాగా తోసివెయ్యడనే ధైర్యంతో స్వయం మాలికవై–"

"ఆఁఆఁ! ఎంత సాహసం చేసిందిరా! ప్రత్యక్షంగా వసంత్ యింటికి వస్తానంటే మనసూ చూసేలేదూ? చూసి వసంత్ ను మరింత మయ్యబ్బుకోలేదూ! ఆడవాళ్ళ ఆవేశం అంతేలే... వెనకాముందూ చూడదు – పోనీ పెరటిదారి నైనా రాలేక పోయిందా!"

"అవును. వసంత్ కూడా సరీగ్గా ఈమాటే అడిగాడు. పంకజానికి చురుక్కురోషం వచ్చింది. ఆమాటతో... అభిమాన పడింది. 'అలామాత్రం అనవద్దు నన్ను. నా కెందుకు అంత భయం? నేను ఇన్నాళ్ళనుంచీ మీకోసం'–"

"తపించిపోయిందా? తపస్సుచేసిందా? ఏమోలే పాపం! నిజంగానే ఒకవేళ..."

[illegible]

"అతనికీ మళ్లీ ఇలాగే సందేహం కలిగి రవంత చలించాడు... కాని—"

"కాని ఎలాతెలవమ్మంటావ్? వాళ్ల అమ్మమాత్రం చేరిన ప్రతీ వాళ్లదగ్గరా మొదట్లో ఇలాగే చెప్పివుండదూ?"

"అవును. అతిఘా ఆమాటే అన్నాడు. ఆతల్లికి కూతురు కాదుటోయ్-అయితే ఒకటిలే. ఆమెతో తగినంత పరిచయం వున్నప్పుడు ఆమె స్వభావాన్ని గ్రహించటం అంతకష్టం కాదనుకో. అయితే మాత్రం లోకం నోరుమూయటానికి ఉపాయం ఏముంది? లోకాన్ని కాదని ఒంటెత్తుగా బ్రతికి సన్యాళ్లా ఎలాగ బ్రతకటం? సామాన్యుడికి అంత స్తోమత ఎలావొస్తుంది చెప్పు. అయినా ఎదురీత యెంతకష్టమో గట్టునకూర్చున్న వాళ్లకు ఎలా తెలుస్తుంది?"

—మేము కూర్చున్నచోట కొంచెం గాలి ఎక్కువయింది. ఘట్టిగా శాలువలు కప్పుకొని - వెచ్చగా సమిధలుకూడా వెలిగించుకుంటూ మాట్లాడుకుంటున్నాం.

"పోనీ పంకజానికి - అతనియందు నిజంగానే అంత అపేక్ష వుంటే, మానసికంగా ప్రేమిస్తూ, కాలక్షేపం చెయ్యకూడదూ? ఏమయినా ఆనందమేగా ప్రధానం. అతడి ప్రతిష్ఠకూ భంగంరాకుండా వుండేది. తానూ పవిత్రంగా జీవితాన్ని గడిపిందీ అయ్యేది. ఏమంటావు?"

ఇరవై తొమ్మిది

"వసంత్ మాత్రం చెప్పేసుకున్నావా ఆమాట. ఆమెను గట్టిగా హత్తుకుంది. ఏమన్నానో తెలుసా? 'అలా బ్రతకటం ఆడవాళ్ళకు ఉంటుంది అవకాశం. అంతటి ఆత్మవిశ్వాసం నాకు లేదు సుమా! సుఖానుభవం లేకపోయినా, మగవాళ్ళను ధ్యానించు కుంటూ — ప్రేమిస్తున్నామనే ఆనందంలో ఏ ఆడవాళ్ళయినా ఉంటారేమో నాకు తెలియదు. ఉన్నా— అంత అసహజంగా నేను బ్రతకలేను. కృత్రిమమైన పద్ధతులు నాకు చేతకావు. కనుక నేగా నాకు నేనై మీదగ్గరకు వొచ్చి అర్థిస్తున్నాను. అందుకనే — మీ కింత చులకనై నాను. నామనస్సులోని బాధ గ్రహించకుండా 'ఆర్గ్యుమెంట్' చేస్తున్నారు. మరల్చుకోని కాంక్ష మనస్సును దహించి, విరక్తి కలిగించి, జీవితాన్ని వదులుకున్నా మీ ప్రతిష్టకు భంగం రాకుండా వుంచేచాలు. అవునా?' అని మాటలతో బెదిరించి అక్కడనుంచి—"

—అర్ధ నిమీలిత నేత్రాలతో వింటున్న వాడిని—ఉలిక్కిపడ్డాను. ఏదో అపూర్వమైన సువాసన సోకినట్లయింది. ఆదుర్దాగా కళ్ళు తెరచి, "ఏమయిందేమిటి?"

అన్నాను ఆ పువ్వువైపు చూస్తూ. కాని ఆ పువ్వు లేదు అక్కడ. గాలిలో తేలిపోతోంది.

ఆ సువాసన ఆ పువ్వుదిగానే తోచింది నాకు. అంతవరకు లేని సువాసన ఆక్షణంలో ఎలా వొచ్చిందో! ఏమో! కొన్ని పూలు వాడిన కొద్దీ పరిమళిస్తాయికదూ...! ఇంతవరకూ

మూపై

ఉపేక్షగా చూసి ఆ పువ్వుమీద అపేక్ష కలిగింది ఇప్పుడు నాకు.

గాలి విసురున పోతున్న పువ్వుమీద వ్యామోహంతో, వెను వెంటనే వెడుతున్నాను. ఇంక నా కప్పుడు చంద్రం ధ్యాసే లేదు. ముందు పువ్వు ... వెనక నేను. ఎంతదూరం వెళ్లానో తెలియదు.

ముందు గోదావరి. అంతవరకు కన్పిస్తున్న పువ్వు మరి కని పించలేదు. వెన్నెల తగ్గి పోతున్నది. చంద్రుడు ఎర్రి పడ్డాడు.

ఆ పువ్వు పరిమళం ముంచెత్తు తోంది నన్ను. కన్పించని ఆపువ్వును ఇంకా పట్టుకుందామనే వ్యామోహంలో మరో. అడుగు ముందుకు వెయ్యబోయాను. కాని మాచంద్రం లాగానే ఆచంద్రుడు కూడా నామీద కక్లెర్రి చేస్తున్నాడు కాబోలునని తోచింది.

వెనుకనే వొచ్చిన చంద్రం మళ్లీ చెయ్యి పుచ్చుకుని వెనక్కి లాగాడు.

“అరె! పనికిరాని పువ్వు అని మోసం చేశావు నన్ను. అది నిజంగా ఏదో మహత్తరమైన పువ్వురా! లేకపోతే యింకా అంతా వాసన కొడుతుందా? చేతులారా జారవిడిచాను”–
“అవునురా యెలా తెలుస్తుంది? మొదట్లో నీకుమాత్రం తెలిసిందా? నేనుచూసిన యిలాంటి పూలకు చాలావాటికి

వాసన లేదు. పోలికలను బట్టి అన్నీ అంతే అనుకున్నాను కాని-"

—నామనస్సు మనస్సులో లేదు.

"అఘోరించి నట్లే వుంది మన లోకానుభవం. కాని – ఆ అమ్మాయి పంకజం ఏమయిందో అదైనా చెప్పు."

అన్నాను దడదడా కొట్టుకుంటున్న గుండెను గుప్పిటతో పట్టుకొని.

"ఇంక నే చెప్పే దేముంది? నువ్వూ ఊహించుకోలేవూ?"

"ఇప్పటికి మనం వూహించిన వూహాలన్నీ ఏమంత సక్రమంగా వున్నాయి? నువ్వే చెప్పు!"

"ఇప్పుడు ఈవువ్వూ ఏమయింది? అంతే!" అన్నాడు దిగాలు పడి.

"హూఁ అంతేనా?" అన్నాను పెద్ద నిట్టూర్పు విడిచి.

"అక్షరాలా అంతే!"

"మరి వసంతో?" అన్నా చతికిలపడి.

"ఈ వసంత్ యేమయినా డిప్పడు? ఇలాగే తన ప్రతిష్ఠను నిలుపుకున్నాడు భద్రంగా—"

# పాపికొండలు

అది చిన్నపడవ. దానికో తెరచాప. చేసే ప్రయాణం అఖండ గోదావరిలో. పాపికొండలుదగ్గరకు రాబోతున్నాయి. అప్పటివరకూ ప్రకృతి సౌందర్యాన్ని చూచి మేము పొందిన సంతోషం ఆ కొండల పేరు వినబడేసరికి గోదావరిలోకి జారి పోయి, ఏదో భయం మాలో ప్రవేశించింది. ఎంతమంది అమాయక వ్యక్తుల ప్రాణాల్ని పొట్టను పెట్టుకోవడం మూలాగా వొచ్చిందో ఆ కొండలకా పేరు. ఆ కొండల పక్కనుంచి ప్రయాణం చేస్తుంటే అవి విరుచుకు మీద పడతాయేమో అని గుండెలు దడదడ కొట్టుకుంటాయి.

హృదయాన్ని అన్యాసక్తం చేసి, మనస్సులోని భయం పోగొట్టుకోటానికి, రాధతో పకడ్బైన బాతాఖానీ ప్రారంభించి, మాకు అవసరం లేనివిషయాలు, ముఖ్యంగా అనవసర మయిన విషయాలుకూడా చెప్పుకోవడం మావిధ్యుక్త ధర్మమైనట్లు భావించి మాట్లాడుతున్నాం. ఎన్ని చెబుతున్నా, ఆమె హృదయాన్ని కరిగించి, కన్ను మలిపితే కనుపించే అఖండ గోదావరిని విస్మృతి పథంలోకి

అంతగాలిరాని యిల్లు వాడికిమాత్రం యెలా పనికి వొచ్చిం
దంటున్నావా?
నిజానికి కద అంతగాలీరాని చీకటికొట్టు కాదు. కాని ఆమెకు
ధారాళంగా రావటానికి సదుపాయాలుండేనే కాని తృప్తి
లేదు. పైకి వాదులు విసుస్తుంటే ఇంక ఆగాధ పడలేక అద్దె
మరో అయిదురూపాయ లెక్కువయినా ఆమెకు నచ్చిన ఇల్లు
తీసుకున్నాడు. కాని అది వాడికి సుతరామూ ఇష్టంలేదు.
ఈకొత్తయింట్లో ప్రవేశించా డన్నమాటేకాని వాడికి
రవంత హాయి అయినా కన్పించలా. ఆయింట్లోకి వొచ్చేగాలి
హోరు తప్పితే అది మితంలేదు సరికదా;అందుమూలంగా
నిత్యమూ తాగినే కాఫీలో నలకల పడటం కూడా తప్ప
టంలా. ఎన్ని సదుపాయాలు చేసుకున్నా అది తప్పించటం
వాడికి సాధ్యం కాలా...
“మీరావు చెప్పేది - కేవలం అతను ఇల్లు మార్చటాన్ని
మాత్రమే కాదు. అతడి జీవితంలో వొచ్చిన మార్పులాగా
వుంది అవునా?”
అనిజమే! మొదటే చెప్పానుగా! కదిలిన కందిరీగలు అంతో
యింతో కుట్టకమానావా?... పోనీ ఇంటివగ్గర కాఫీ
మానేసి, హోటల్లో త్రాగటం అలవాటు చేసుకుందామా
అనుకున్నాడు. కాని ఆమాట తలుచుకునే సరికే అసహ్యం
వేసింది. ఎంతమంది త్రాగిపారేసిన కప్పులతోనో మనం

త్రాగేది. పైకి శుభ్రతగా ఉన్నట్లు కన్పించటమే కాని తీరా పరిశీలించి చూస్తే ఈగలూ దోమలూ...అయినా ఆకాఫీలో 'ఫ్లేవర్' ఏంవుంటుంది? అది త్రాగటంవల్ల అతడికి కలిగే సుఖం ఏమిటి?...ఒకవేళ కలిగినా డబ్బు యిచ్చి కొనుక్కున్న సుఖమే కదూ అది!

ఇంతా ఆలోచించి, ఇంట్లో కాఫీ రుచించక, బయట కాఫీ త్రాగటానికి; అసహ్యించుకుని, రెప్పపాట్లు లెక్కపెడుతూనే చింపేశాడు మరో సంవత్సరం క్యాలెండర్ షీట్సు. ఈలోగా అతడిలో కొంత పరివర్తన కలిగింది...

ఇంతవరకూ వాడితో చనువుగా మాట్లాడే స్నేహితులు, ఇప్పుడు వాడితో మాట్లాడటం తమ ప్రతిష్ఠకు భంగమన్నట్లు, కొంచెం వైతొలగివుండటం గమనించాడు. పరోక్షంలో తనంటే రవంత చులకనభావం కన్పరుస్తున్నారని కూడా గ్రహించాడు.

తాను బజారువెంట నడుస్తున్నా, తనను చూచి ఇదివరలో గౌరవంగా లేచిపోయే స్త్రీలు...యిప్పుడు వేలెత్తి చూపిలోపల్లోపల ముసిముసినవ్వులు నవ్వుకోటం సాగించారు. ఎందువలనో? తన ప్రవర్తనలో లోట్లు యేమయినా ఉన్నా యేమోనని పర్యాలోకన చేసుకున్నాడు. ఇదివరకు కన్న యిప్పుడు 'హోదా' వాడికి తగ్గలేదు. ఉద్యోగంలో ప్రమోషన్ కూడా వొచ్చింది. జీవితంలో అభ్యున్నతి

వ్రాస్తున్న తనుకున్న కొద్దీ, అంతరంగికంగా వాడు క్రుంగి పోవటంసాగించాడు. లోకుల హేళనకు పాత్రుడౌతున్నాడు. కారణం ఏమయివుంటుంది?

ఒకసారి ఎందుకో వైజాగ్ వెళ్ళవలసిన పనికలిగింది ఆఫీసుకు సెలవుపెట్టి రైలుకు వెళ్లాడు. అదృష్టవశాత్తూ ఆ రైలు కాస్తా తప్పిపోయింది. తిరిగి ఇంటికివచ్చి మేడమీద వరండాలో క్యాంపుకాట్ వేసుకుని పడుకున్నాడు.

ఆకాశంలో కాస్త చిన్న చిన్న మబ్బు తునకలు అల్లుకుంటు న్నాయి. కొంచెం మెరుపులూ మెరుస్తున్నాయి. బహుశా వర్షం వస్తుందేమో! అసలు కొద్దిరోజులనుంచి మధ్య మధ్య కొద్దిగా మబ్బులల్లుకుంటూనే వున్నాయి. అయినా ఏం చెప్ప గలం? దట్టంగా అల్లుకున్న మబ్బులుకూడా చినుకురాల్చ కుండా తేలిపోవటంలా?

అంతగా వరండాలోకి జల్లుకొడితే అప్పుడే లేవచ్చు ననే ఊహతో ఉత్తరీయం కప్పుకుని అక్కడే పడుకున్నాడు. ఆ క్రిందటి రాత్రి పొద్దుపోయేవరకూ నిద్రపట్టక పోవటం మూలంగా కాబోలు గుండెల్లో కొంచెం చిక్కపట్టినట్లుగా వుంది. ఎడం కన్ను అయిదారు రోజులనుంచీ నీళ్లు కారు తోంది 'అవిరి' అయినట్లు.

దూరంగా ఉరుము చప్పుడు వినపడింది. ఎక్కడ నుంచో ఒక కాగితపు వుండవచ్చి సరిగ్గా కంటిమీద

సాగిలింది. ఆ వృత్తంలో ఒక గులకరాయి కూడా వుంది. ఆ కాగితమే లేకపోతే గుర్తు చిక్కేదేమో! కాగితమే లేకపోతే రాయే పడేది కాదేమో!...

మంచం మీదనుంచి లేచి, పిట్టగోడ వద్దకు వచ్చి క్రిందకు చూచాడు. ఆ రాయి విసరిన వ్యక్తి ఇతణ్ణి చూచి యేమీ యెరుగనట్లు ముఖం స్పష్టంగా కన్పించకుండా గొడుగు తెరచి వేసుకుని వెళ్ళిపోతున్నాడు. వైఖరినిబట్టి మర్యాదస్తుడిలాగానే వున్నాడు. కాకీ, కోయిలా ఒకలాగానే కదూ వుంటాయి చూడటానికి.

కన్ను కొంచెం బాధించసాగింది. ఆ రాయికి చుట్టిన కాగితం ఏమిటో అని విప్పి చూచాడు. వొట్టి తెల్ల కాగితమది. ఆ కాగితాన్ని అక్కడే పారేశాడు. తుంపర ముదిరి చినుకులయినాయి. జల్లుపడిన చినుకులకు కాగితము కాస్త తడిసేసరికి, విస్పష్టంగా అక్షరాల గుర్తులు కనపడ్డాయి. ఆ మొదటి అక్షరాలు చూసేసరికి అతడికి ఉద్వేగం కలిగింది. ఆ రెండక్షరాలూ, తాను తప్ప మరొకరు కలంలోనయినా స్మరించకూడనివని - అవి సర్వ హక్కులతోనూ, తన వేనని అతడికి తెలుసు.

కన్ను బాధ మరీ అధికమయి, నీళ్లు బొటబొట కారుతున్నాయి. తడబాటుతో ఆ సగం తడిసిన కాగితాన్ని తీసుకున్నాడు

తీరా అది చదివేసరికి తడవని భాగమంతా కన్నీళ్లతో తడిసింది అన్నీ అక్షరాలే.

గుండె సూదుల షీట్ లా గుచ్చుతుంటున్నట్లుంది అతడికా కాగితం. దగ్గరగా పిడుగు పడ్డట్టు చప్పుడయింది. తననుఅంతా ఇప్పుడు తేలిగ్గా చూడటం ఎందుకో బాగాఅర్థమయింది. ఇందాకటి కన్న ఉరుములూ, మెరుపులు జాస్తి అయినాయి. తన రాజ్యం అంత కేటాయింపుగా వుండే ఇల్లే ఎందుకు కావాన్నదో తెలుసుకున్నాడు.

ఆకాశం చిల్లులు పడ్డట్టు వర్షం. కాలంకాని కాలంలో ఇప్పుడు గోదావరి వరదవస్తున్నట్లుగా వుంది. మేడమీద నుంచుని వెనుదిరిగి గోదావరివైపు చూస్తూంటే ఎంతో గంభీరంగావుంది. ఇప్పుడు కురిసిన వర్షానికి అప్పుడే ఇంతవరద ఎలావొచ్చింది చెప్మా! అని ఆలోచిస్తున్నాడు. ఏ కొండల మీద వర్షించారో ఆ మేఘాలన్నీ ఇన్నాళ్లనుంచీ. నోరులేని జీవాలు, నోరున్న జీవాలు, అనే విచక్షణ లేకుండా, సర్వమూ మన్య ప్రదేశాల్లోంచి, కొద్దిరోజుల క్రిందటివరకూ సురక్షితంగా వున్న ప్రదేశాల్లోంచి కొట్టుకుని వస్తున్నాయి. తేలుతున్నాయి, మునుగుతున్నాయి. ఏవొడ్డుకు కొట్టుకునిపోతాయోమరి! ఈవరద ఇంకఎన్నాళ్లు వుంటుందో ఇలా! ఎవరుచెప్పగలరు! కొంచెం చలిగాలి వీస్తోంది.

"రాజ్యం"

ముప్పై తొమ్మిది

ఊహూఁ వినిపించుకున్నట్లు లేదు. పరధ్యానంగా వున్న దేమో అనుకుని మళ్ళీ పిలిచాను.

"రాజ్యలక్ష్మీ"

ఈసారీ సమాధానం రాలేదు.

రాజ్యం - టాయిలెట్ చేసుకునే ధ్యాసలో వుంది. డ్రెసింగ్ టేబుల్ దగ్గర సగం సగం అయిపోయిన టాయిలెట్స్ సెట్ అంతా చిందర వందరగా పడివున్నాయి. కనుబొమ్మలు చక్క-గా దిద్దుకుంటోంది. ఆ ముఖాన్ని చూస్తే సహజంగా ఎలా వుంటుందో వూహించడం కష్టమే, అంతదాకా ఎందుకు ముద్దు పెట్టుకున్నా పౌడరు అతుకాల్సిందే కాని బుగ్గమాత్రం యెంగిలికాదు. పెదవి కొరికినా రంగు అతుకాల్సిందే కాని పెదవి మాత్రం గంటుపడదు

తల్లోని యింద్ర ధనస్సుకు కళ్లు జిగేల్మన్నాయి. అబ్బ! ఎన్ని రకాలపూలో! రంగులైతే అందంగానే కన్పిస్తున్నాయి. కాని వాసనలు మాత్రం గుబాళించటంలా. సన్న సన్నని పూలువున్న పసుపుపచ్చ క్రేప్ సిల్కు కట్టుకుంది. ఆమెకిప్పుడు తెల్లచీరె మీద మోజు రంగుచీరెలమీదికి ప్రసరించింది. ఏం మాట్లాడాలో ఎలా ఉపక్రమించాలో తెలియక తికమక పడుతూనే అడిగాడు.

పలకై

రాజ్యం! ఈకృత్రిమమైన అలంకారాలన్నీ సహజంగా వుండే అందాన్ని చెడగొట్టడానికి తప్ప, మరెందుకైనా ఉపయోగపడతాయంటావా?"

"ఉన్న అందాన్ని మరింత అభివృద్ధిచేసుకోడానికి ఏర్పడినవే ఇవన్నీ" అన్నది చిరునవ్వునవ్వుతూ, చీర కుచ్చెళ్లు సరిచేసుకుంటూ.

ఆమె చిరునవ్వు అతణ్ణి చిచ్చులా దహించింది. అయినా ఆమె హృదయాన్ని స్పష్టంగా తెలుసుకోవాలనే ఊహతో -

"నిజమేనేమో, కాని యిన్ని రకాల పూలూ, అలంకారాలూ, వీటన్నిటివల్ల నిజమయిన ఆనందం కాని, సౌఖ్యం కాని వుంటుందంటావా? ఒక్క పూవులోని మకరందాన్ని సంపూర్ణంగా ఆస్వాదించడం ఉచితంకాని మకరంద భ్రాంతితో అన్ని పూవులు నాకే కావాలనుకోవటం......?"

"ఒక్క పువ్వులోని పరిమళాన్ని - మకరందాన్ని మాత్రమే అనుభవిస్తే యేమయినట్లు? ఒక్కొక్క పువ్వుకు ఒక్కొక్క మాధుర్యం వుంటుంది. మాటవరసకే అనుకుందాం గులాబి అందం సంపెంగికి వస్తుందీ! సంపెంగి పరిమళం గులాబికి వుంటుందీ? - వీలైనంతవరకు అన్ని అనుభవాలు సమకూర్చుకోవటం మంచి "కదూ?"

నువ్వు చెప్పేమాటలు ఎంత సహేతుకంగావున్నా, జీవితాలకి అన్వయిస్తే అధోగతి పాలవక తప్పదు." "ఏం? అలా

కోపంగా వున్నారేం? నేనేదయినాపొరపాటుమాట అన్నానా?" అనునయపూర్వకంగా దగ్గరగా వొచ్చిచెయ్యిపట్టుకుని, ముఖంవైపు సాభిప్రాయంగా చూచింది. చెయ్యి విదిలించుకున్నాడు. వెనక్కి తిరిగాడు, పెదవి విరిచాడు.

వెళ్ళుతిన్న కన్నును ఎన్నోవిధాల బాగుపరచి పూర్వ స్థితికి తీసుకుని రావటానికి ప్రయత్నించాడు. కాని ఏమంతయినా ప్రయోజన మున్నట్లు కన్పించలా.

డాక్టర్లు, కూడా ఏదోవిధంగా ధైర్యం చెప్పలేకపోయారు సరికదా; ఇంక మీకు ఆ కన్నువల్ల ఆట్టే ప్రయోజనం వుండదు అనే నిరుత్సాహాన్నే వ్యక్తపరిచారు. తన అనుభవపూర్వకమైన వైద్యపద్ధతివలనగాని, ప్రకృతి వైద్యంవల్ల గాని కూడా ఏమంతయినా లాభమున్నట్లు తోచలా. ఏమిటి చెయ్యటం? జీవితంలో ఏఅవయవయం ప్రధానమో అదిఅవిటిదయింది. కొంచెం లీలగా మాత్రం కన్పిస్తోంది.

ఆ ఇల్లు మార్చటం ఆమె కిష్టంలేకపోయినా, తన కాయిల్లు అండమాన్ ద్వీపంలావున్నదని మార్చాడు. ఆమె ఇప్పుడు ఘట్టిగా ప్రతిఘటించడానికి, మునుపటివలె ప్రతి విషయం లోనూ, తనమాట అంతగా సాగదని పస్తాయించింది. కాని ఈకొత్త యిల్లు ఆమెకు కలకత్తా చీకటికొట్టు జ్ఞప్తికి తెస్తున్నట్లుంది.

నలభై రెండు

ఒకవీధి మలుపులో వున్న యిల్లు ఇది. ఆయింట్లో వున్న జనాభానుపట్టి అయింటినే ఒక చిన్న మ్యునిసిపాలిటీగా చెయ్యటానికి అవకాశం వుంది. గాలివొస్తుందా రాదా అన్నమాట అలావుంచి, ఆ ప్రాంతాలకు అసలు పూలేరావు.

పరిపరి విధాల ఆలోచించింది. తనకు అనుకున్నట్లు సదుపాయాలు గల యిల్లు మరొకరికి గిట్టదు. అందరకూ అనుకూలంగా వుందనుకునే యిల్లు తనకు నచ్చదు. ఈ అభిప్రాయభేదం ఎలాపోతుంది? ఆలోచిస్తోంది.

ఈ యింట్లోకి వచ్చిన తర్వాతయినా వాడికి కన్ను బాధ అనుకున్నంతగా తగ్గలా. కన్ను ఏదో 'ఇరుకున' పడ్డట్టుగా వుండేది. కొన్నాళ్లు సెలవు పెట్టాడు, వాతావరణం మార్చుకుంటే ఏమయినా ప్రయోజనం ఉండక పోతుందా అని. అలాగూ ప్రయత్నించాడు. కాని ఊహూం.

ఈ బాధలన్నీ పడటం కంటె ఆ కన్ను అసలే తీసివేయించుకుంటే యేబాధావుండదన్నారు కొందరు. మంచికయినా, చెడుకయినా వున్న కన్నును బుద్ధిపూర్వకంగా తీసిపారెయ్యటం అంత తేలికయిన పనికాదు. ఏనాటికైనా బాగుపడవచ్చుననే ఆశవుండక పోతుందా? ఆ ధైర్యంతోనే ఇంక ఆ కంటిని గురించి తన ప్రయత్నాలు మానుకున్నాడు విసుగెత్తి. మళ్లీ ఆయింట్లోనే యథాప్రకారంగా చేరాడు.

రాజ్యలక్ష్మికి ఇంక ఆయింటో వుండటం అసంభవ మనిపించింది. ప్రాణం ఏదో ఇరుకునపడ్డట్టు వుంది అక్కడవుండటమంటే. అక్కడ వుండటంకన్న హాయిగా ఏ ఆచ్ఛాదనలు నిబంధనలు లేకుండా, స్వేచ్ఛా వాయువులను పీలుస్తూ గడపటం ఎంతో యుక్తంగా తోచింది.

అనుకున్నంతా జరిగింది. నామమాత్రంగా వున్న ఆకన్ను అసలు కన్పించకుండాపోయింది అతడికి. ఎంతో బాధపడ్డాడు. కదూమరి! అసలు మొదట్నుంచీ లేకపోతే యేబాధ లేదు. కొన్నాళ్లు కన్పించి, మధ్యలో అకస్మాత్తుగా కనబడకుండా పోవటం ఆంతరంగికంకూడా ఎంతబాధ? ఎంత అసంతృప్తి? ఇంక ఆకన్ను మళ్లీ యెన్నటికీ రవంతయినా నొప్పి కలుగకుండా చేసుకున్నాడు.

అమావాస్య.

చీకటిపడింది దారి కనపడనంతగా. దానికి తోడు పురపాలక సంఘంవారి దీపాలుకూడా పాడైనాయి ఆనాడు. కొట్లల్లోనూ, యిళ్లల్లోనూ వున్న కిరోసిన్ దీపాలు, మైనపువత్తుల వెలుతురు పడినచోట్ల మాత్రం దారి రవంత కన్పిస్తోంది నడుస్తూంటే కాలు కాస్త మడత పడినట్లుగా వుంది ఇంటికివొచ్చాడు. మైనపువత్తి వెలిగించాడు. కాలు మడత పడటమేకాదు. దెబ్బతగిలి గోరు సాంతం వూడిపోయింది. దెబ్బ తగిలినప్పుడు – ఎంత దెబ్బో తెలుసుకుంటేనే మరింత

బాధ. ఎన్ని విధాల సహించాలని ప్రయత్నించినా - ఊహుం సహించలేకపోయాడు. కంటిబాధ, దానితో పాటు కాలుబాధ. నిద్ర యెలాపడుతుంది? కరిగే మైనపు వత్తులు కరిగిపోతున్నాయి. వెలిగించే వొత్తులు వెలిగిస్తున్నారు. ఆవొత్తికూడా కరిగిపోయింది. తెల్లవారను మాత్రం తెల్లవారలా ఇంకా.

ఇప్పుడు తనను లోకులు ప్రత్యక్షంగానే వేలెత్తి చూపుకుంటున్నారు. దురదృష్టవశాత్తు జీవితంలో సంభవించే కష్టాలకు కాని నష్టాలకు కాని లోకం అనుకంప చూపిస్తుందా! దాని పుణ్యమాయిరి- అనుకంపమాట అలావుంచు - అపహాస్యం చెయ్యకుండా వున్నా బావుండిపోను. కాని ఏమీ అనకుండా వుండటానికి మూగది కాదుగా లోకం!

అతడు యెంత గౌరవంగా కాలక్షేపం చెయ్యాలనుకున్నా సాగింది కాదు. సామాన్యంగా అలాంటివాళ్ళు ముందు ఆత్మగౌరవం కాపాడుకోవాలి. అది చెడింతర్వాత - తనువల్ల గాని, తమ ఆత్మీయులవల్లకాని, గౌరవం కోసం ప్రాకులాడితే గాలికిమీదపడ్డ గడ్డిపోచనువిదిలించినట్లు నిరసనగా చూస్తారు. అతడికి అనుభవసిద్ధమయిందిది.

ఎక్కడికయినా వెళ్ళి, ప్రశాంతంగా జీవితం గడపాలని అనుకునేవాడు. బహుశః ఆకోరికకూడా కొద్ది రోజుల్లోనే తీర్చుకోటానికి ప్రయత్నిస్తాడనుకుంటాను. ఈగోదావరి అంచులనున్న ప్రశాంత ప్రకృతిలో ఎక్కడ వొచ్చికూర్చుని కాల

క్షేపంచేసినా చెయ్యవచ్చుకదా! అలాంటి ఊహాలున్న వాళ్లు!

ఇదంతా నేను ఊహించి చెప్పే మాటలుకాదు రాధా! "ఇలా తన సొద, తనఊహాలు ఎన్నోసార్లు వెళ్లపోసుకున్నాడు నాదగ్గిర పాపం!"

అంటూ పక్కనున్న ఫ్లాస్కులోని కాఫీ చేసగం త్రాగుతున్నాము.

ఇదంతా వినేసరికి రాధ ఏదో అలసిపోయినట్లయింది.

ఆమెకు కళ్ళుమూసినా, తెరిచినా, లీలగా రామం స్వరూపమే కన్పిస్తోంది. పాపికొండలు చాలాదగ్గరకు వొస్తున్నాయి. సూర్యాస్తమయం కాబోతుంది. పడవ క్రమంగా ఒడ్డుకు చేరుతున్నట్లుంది, ప్రయాణీకులు ఎవరైనా వొస్తున్నారోయేమో!

"పాపికొండలు మరీదగ్గరకు వొస్తున్నాయి. నాకెంచేతో భయభయంగా వున్నది" అంటూ నాబుజంమీదకు వాలిందిరాధ. "మరేం భయంలేదు. మనపడవకు యిలాంటి ప్రమాదం కలగటానికి అవకాశంలేదు. పైగా మన పడవ సరంగుచాలనేర్పరి. అపాయాల్నుంచి తప్పించుకునే ఉపాయాలు ఎన్నో తెలుసు అతడికి. అంతేకాదు. కావలసినంత సాధనసంపత్తితో బయలుదేరాడు కూడా. భయపడకురాధా"

అని బుజ్జగించటం ప్రారంభించాను, కాని, నన్నూ కొంత భయం ఆవరించకపోలేదు. అందుకుతగినట్లుగానే పడవ యింక కదలలేదు. సరంగువొచ్చి యింక "ఈరాత్రి పడవకదల దిక్కడనుంచి' అన్నాడు.

"ఎందువలన" ఎంతో ఆదుర్దాగా ప్రశ్నించా.

"ప్రొద్దుపోయింది. పాపికొండల్లో గోదావరి మరీ ప్రమాదంగా వుందిట! ఇంతకు ముందుగానే ఓ పడవకూడా మునిగిందిట బాబూ!" అన్నాడు.

ఆమాట వినేసరికి రాధకు గుండెల్లో గోదావరి ప్రవహించినట్లయింది.

"నిజం! ఎవరు చెప్పారు?" అన్నా ఆవేగంగా.

సరంగు వెనకాలనే కొత్తమనిషి కన్పించాడు, వీరే చెప్పారు. అన్నాడు సరంగు.

అతణ్ణి పోల్చుకోగలిగాను. ఎంత పరిచితుడే పూర్వం నాడు. ఉద్యోగవశాత్తు ఈ అడవుల్లో తిరుగుతూండటం మూలంగా వెంటనే గుర్తించలేకపోయాను మొదట్లో.
ఇద్దరం వారి పరిచయాలు జ్ఞప్తికి తెచ్చుకుని, పిచ్చాపాటీ కొంతసేపు మాట్లాడుకున్న తర్వాత అడిగాను.
"ఎలా జరిగిందో యీ ప్రమాదం? పాపం! ఎవరో అందులో ప్రయాణం చేస్తున్న నిర్భాగ్యులు?"

"దాదాపు ముప్పైమంది ప్రయాణీకులు మునిగిపోయారు మన రామారావును ఎరుగున్నావు కదూ! వాడు కూడా ఆముప్పై మందిలో ఒకడైనాడు పాపం! వాడి జీవితమంతా, అదోరకంగా పరిణమించింది. ముప్పై ఏళ్ళయినా వున్నాయోలేవో, ఎంతో అభివృద్ధిలోకి రావలసినవాడు ఉద్యోగానికి రాజీనామా యివ్వడమేమిటి? వైరాగ్యంతో అడవుల్లో కాలక్షేపం చెయ్యాలని ఆసక్తి ఏమిటి అందుకే బయలు దేరాడు ఇవ్వాళ. పాపి కొండల్లోకి వచ్చేసరికి పడవసుళ్ళు తిరిగిందట. అందులోవున్న వాళ్ళంతా హడలిపోతూంటే పడవ ఏమౌతుందోఅని, అతడు మాత్రం అద్దంలో పిల్లలు తమ పాపలనుచూసి కేరింతాలు కొట్టినట్లు ఆప్రకృతి సౌందర్యాన్ని చూసి మురిసిపోయాడు. చివరకు ఆయుస్సు తక్కువైంది పాపం!"

అనుకంపతో ఈమాటలన్నీ సరంగువిన్నాడు. "అసలు సరంగులోకూడా వున్నదిలెండి కొంత తెలివితక్కువ. తెడ్డువేసేవాడి దారివొకటి, చుక్కాని నడిపేవాడి దారి మరొకటి. పైగా ఆతెరచాప ఎన్ని గాలివానల తాకిడికి ఒరుసుకుందో చివికి చిల్లులు పడింది. అలాంటప్పుడు ఎంత తెలివితో నడపాలండి! ఇదీ ఓ విద్యేనండీబాబూ!"

అన్నాడు చుట్ట వెలిగించి సరంగు.

"అయితే యిక్కడ ఎన్నాళ్లు ఆగమంటావు సరంగూ"

"ఎన్నాళ్ళోనా? తెల్లవారిందాకా ఉంటే చాలదుటండీ! చీకటి అని సందేహిస్తున్నా కాని, లేకపోతే మనకు భయమేమిటండీ! అసలు వెన్నెలొచ్చేసరికి గోదావరికూడా అట్టే ప్రమాదంగా వుండదు బహుశా. అయినా మీరు భయపడకండి. ప్రమాదం రాకుండా జాగ్రత్తపడటానికి తగిన సాధనాలన్నీ వున్నాయి మనదగ్గిర" అన్నాడు.

సరంగు చెప్పినదానికి మా మనస్సులు కాస్త తేరుకున్నాయి.

... ... ...

చంద్రోదయమైంది. ఆ కిందటిరోజుకంటె ఆనాడు చంద్రునిలో మరో విశిష్టకళ కన్పించింది. తేటగా వెన్నెల మామీద పడుతోంది. గోదావరి క్రమంగా ప్రశాంతి వహిస్తున్నట్లు తోచింది.



# అపశ్రుతి

ఉన్నగా అనగా కోయిల కూసింది. ఎప్పుడు వింటామా కోయిల స్వరం అన్న ఆశ మొలాగయితేనేం ఫలించింది. అయితే ఆ స్వరం అనుకున్నంత హాయిగామాత్రం లేదు. అంతమాత్రాన ప్రభాకరానికి అసంతృప్తిని కలిగించలేదు — ఇన్నాళ్ళకు తన రసాలంమీద కూడా 'కోయిల కూసింది' అన్న సంతృప్తి అతడికి.

ఆ కోయిల స్వరం ఏవంత జీరపోయినట్లు ఉన్నమాట నిజం. అన్ని కోయిలల కంఠాలూ సహజంగా అంతేనా? లేక ఈ కోయిలమాత్రం పొరబాటున ఏదైనా తినకూడని చివుళ్లను తిని తన కంఠాన్ని అలా పాడుచేసుకుందా? ఏమో!

ప్రభాకరం వీణ వాయించటం ప్రారంభించాడు. కాని తలవని తలంపుగా ఆ వీణలో అపశ్రుతి పలుకుతున్నట్లు తోచింది. ఇది వరకుంచి ఆతడంత శ్రద్ధగా గమనించడంలేదేమో! లేకపోతే అకారణంగా అంతలో ఎలా పాడవుతుందీ!

అతడావీణను తెచ్చుకుని రెండు మూడు సంవత్సరాలయింది. ఆ తెచ్చుకున్న కొత్తలో వారం-పదిరోజులు ఏంవాయించాడో!

అంతే! ఆతర్వాత అతడికి 'లా' చదవటంలో సాధనచేయటా నికి తీరుబడి లేకపోయింది. ఈ వీణమీద మోజుతో ఆచదు వుకు విఘ్నం వొచ్చినా రావచ్చుననీ అనుకున్నాడు. ఈరెండు సంవత్సరాలూ కళ్ళుమూసుకుని – కష్టమనిపించినా గడిపేస్తే, ఇంటికి తిరిగి వొచ్చింతర్వాత నిత్యమూ సాధనచెయ్యొచ్చును కదా అని సమాధాన పడ్డాడు. మళ్ళీ ఎటొచ్చీ నెలా–నెలాపది హేనురోజులనుంచి వీణను అభ్యాసంచేస్తున్నాడు.

... ... ...

అసలా వీణను సరిగ్గా శ్రుతిచేస్తే మహతీస్వనంలాగా – కచ్ఛపీ స్వరం లాగా పలుకుతుందని తెలుసు.

కాని ఈలోగా ఎవరైనా అంత విలువైన తన వీణను శ్రుతి చేశారా? లేకపోతే ఏమిటీ అపశ్రుతి?

అనూరాధను పిలిచాడు.

ఆమె కా పిలుపులోనే కొంచెం కాఠిన్యం వున్నట్లు తోచింది. ప్రభాకరం ఆమెను ఇప్పటికి ఎన్నిసార్లు పిలిచివుంటాడో లెక్క పెట్టి చెప్పవచ్చు, కాని ఇలాంటి స్వరంతో పిలిచింది ఇప్పుడు మాత్రమే.

బేలచూపులుచూస్తూ, గాలికి కదిలే లేతచిగురులాగా వొచ్చి నిలబడింది. తనపిలుపులో తనకు తెలియకుండానే కాఠిన్యం వ్యక్త మయిందని ఆమెనుచూసేవరకూ ప్రభాకరం గ్రహించలేదు.

తన పొరబాటుకు నాలిక కొరుక్కుని,

"అనూ! ఇలారా! భయపడతావెందుకు?" అని సాంత్వనంగా దగ్గరకు పిలిచి.

"చూడు. ఈ వీణను నే లేకుండాచూసి ఎవరైనా కదిలించి శ్రుతిచేశారా? అపశ్రుతి పలుకుతున్నట్లుందే లీలగా!" అని అడిగాడు సహజమయిన కంఠస్వరంతో.

ఆమాట వినేసరికి ఆమెకు శరీరం కొంచెం ఝల్లుమంది. మరచిపోతున్న విషయం జ్ఞాపకంవొచ్చినట్లయింది. తనమిత్రుడు-కాదు అన్నగారి మిత్రుడు ఎప్పుడో ఒకటి రెండుసార్లు కదిలించి శ్రుతి చేసినమాట నిజమే. కాని ఆవిషయం భర్తకు ఎలా తెలిసిందీ? ఊరికే ఊహామాత్రంతో అలా అడుగుతున్నాడేమో! ఈ మాత్రానికి చెప్పకపోతేమాత్రం యేం? తీరా చెపితేమాత్రం కోపం తెచ్చుకోక ఊరుకుంటాడా?'

కొంచెం భయాన్ని అణచుకుని, సహజమయిన సిగ్గుతో,

"ఏమో! నాకు తెలియదు" అన్నది జీరపోయిన కంఠంతో.

ప్రభాకరం స్వభావం అనూరాధకు యింకా పూర్తిగా అర్థంకాలా. అతడిముందర ఏవిషయం ఎలా మాట్లాడాలో – సరిగ్గా తెలియదు. నిజానికి పూర్తిగాఅర్థమయ్యేంత అవకాశం మాత్రం యేది? ఆమె కాపురానికివొచ్చి ఇంకా నెలా – నెలాపది హేనురోజులయినా అయిందో కాలేదో!

యాశైకందం

ఏమాట చెప్పటానికీ తోచక తటపటాయించి, ప్రస్తుతం తప్పించుకోటానికి అలా అబద్ధమాడి వుంటుందని ప్రభాకరం గ్రహించాడు.

ఊఁ. తెలియదూ ?" అని వొస్తున్న చిరునవ్వును పెదవుల లోపలనే దాచుకోటానికి ప్రయత్నించాడు గంభీరంగా.

... ... ...

ప్రభాకరం మనస్సు ఎంతసున్నితమో ఆమె క్రమక్రమంగా గ్రహిస్తోంది. అతడికి తనమీద యెంతటి అనురాగమో కూడా ఇప్పుడిప్పుడు తెలుసుకుంటోంది. తనను విడిచి అరక్షణం వుండాలంటే అతడి మనస్సు ఎంత బాధపడుతుందో కూడా గ్రహించగలదు ఇప్పుడు.

... ... ...

కోర్టు కయితే వెడతాడు. కాని పనివున్నా లేకపోయినా ఎప్పుడూ 'బారు'లో కూర్చుని 'బాతాఖానీ'లో కాలాన్ని పాడు చెయ్యటం ప్రభాకరానికి యిష్టంవుండదు. పనిపూర్తికాగానే ఇంటికి వొచ్చి వాలాలిసిందే.

ఒకనాడు ఇంటికివొచ్చేసరికి అనూరాధ పడుకొని నిద్ర పోతోంది. ప్రభాకరం పరుపుమీద కూర్చుని మెల్లగా ఆమె నుదుటిమీద ఉఫ్ మని వూదాడు. ఆ గాలికి ఆమెకళ్లు చంద్ర కిరణాలు సోకితే విడివడే కలువల్లాగా విడివడ్డాయి. ఆమెను అలాగే చేతుల్లోకి తీసుకుని—

యా త్రై మా దు

"మధ్యాహ్నం నిద్రపోవటం అంత మంచిదికాదు అనూ! పగటినిద్ర ఉత్సాహాన్ని హుషారును తగ్గించటమేకాకుండా మాంద్యాన్నికూడా కలిగిస్తుంది. సాధ్యమయినంతవరకు ఆ అలవాటును మార్చుకోటానికి ప్రయత్నించరాదూ!"

రెండువేళ్లతో ఆమె అధరాన్ని నొక్కుతూ అనునయపూర్వకంగా చెప్పాడు.

ఆనాటినుంచీ ఆమె యెప్పుడూ పగలు కన్ను మూసి యెరుగదు

ఒకరోజున మధ్యాహ్నం అతడు వొచ్చేసరికి అట్టమీద ఊలుతో బొమ్మను కుడుతోంది. ప్రభాకరం వెనకాలగావొచ్చి కొంటెతనానికి గిలిగింతలుపెట్టాడు. ఆ కదిలించటంలో ఆ సూది ఆమె వేలికి గుచ్చుకుని ఒక్కచుక్క రక్తం పైకి చిమ్మింది. గిలిగింతల వల్లకలిగిన ఆనందంలో అనూరాధ ఆరక్తపుబిందు సంగతి తెలుసుకోలేకపోయింది. ఆమె వేలి మీద రక్తపుబిందువు ఒక్కటయినా అతడి ముఖంలో కన్నీటిచుక్కలు దొర్లాడాయి. అనూరాధ తన చేతిమీదపడ్డ కన్నీటిచుక్కలను చూచి తెల్లబోతూ.

"ఏం? అలావున్నారేం?" అంది భయ - భయంగా.

"అబ్బ! వేలుబాధగా ఉన్నదా అనూ!" అని ఆమె వేలును తననోట్లో పెట్టుకున్నాడు.

యా త్రై వా లు గు

అప్పటివరకూ అనూరాధకు తన వేలికి సూదిగుచ్చుకున్న దన్న సంగతి తెలియనే తెలియదు.

... ... ...

అప్పుడప్పుడు ప్రభాకరం సరదాగా అనూరాధతో చదరంగం ఆడుతూవుండేవాడు. బుద్ధివికాసానికి చదరంగం ఎంతో మంచి ఆట అని అతడినమ్మకం.

అతడు చదరంగంలో నిధి. ఆమె యెప్పుడయినా పొరబాటున తప్పుగా నడిపిస్తే,

"అలా నడిపిస్తే నీ ఆట కట్టించడం నిమిషం; ఒక్కగడిముందుకు కదిలామంటే వెనకాముందూ ఎంత ఆలోచించాలి? అలా కాదు—ఇలా..."

అని నవ్వుతూ ఆమెకు యుక్తులు నేర్పి ఆమె చేతిలో తను ఓడి పోయేవాడు. అలా ఓడిపోవటం అతడికి సరదాగానే వుండేది. హాస్యాలలోనైనా ఆమె మనస్సు చివుక్కుమంటే అతడి మనస్సు గాయపడేది. పైగా,

"అప్పుడే చదరంగంలో ఎంత ప్రజ్ఞసంపాయించావ్ నన్నుకూడా ఓడించేస్తున్నావ్? అవునా?" అని నవ్వుతూ 'ఊ' అనమని రకరకాలుగా వేధించేవాడు.

ఆమె చెప్పతలచుకున్న సమాధానాన్నికూడా చెప్పటానికి సిగ్గు పడి, ముసి ముసినవ్వులు నవ్వుకునేది.

యా ౖ ఆ యి దు

అతడు విడిచిపెట్టేవాడు కాదు.

'గెలుపు నాది' అని అనమని బలవంతంచేస్తే. అనలేక అనలేక అమాయికంగా అరగంటసేపటికి ఆమాట అనబోయి, అర్థో క్తిలో 'గెలుపు' అని మిగతామాట సిగ్గుచాటున దాచుకునేది; లేదా చిరునవ్వులో కలిపేసేది మొదటి రోజుల్లో.

అయినా భర్త దగ్గర అప్పుడే ప్రౌఢంగా మాట్లాడటం ఎలా చేతవుతుందీ? వడసారం పద్దెనిమిదేళ్లయినా వెళ్ళాయో లేదో ఇంకా!

కాని ప్రభాకరం మరింత చనువుగా వుండటంవలన ఇప్పుడిప్పుడు "గెలుపు నాది" అని అనమని బలవంతం చేస్తే; "నేనుగెలిస్తే మీరు గెలిచినట్లుకాదూ?" అనిమాత్రం అనగలుగుతోంది.

ఆమాటలు ఆమెఅంతట ఆమె అనటం అతడికి ఎంతో ఆనందం కలిగేది. ఆ ఆనందాతిరేకంలో 'అనూ' అని దగ్గరకు తీసుకుని హృదయానికి హత్తుకునేవాడు.

పుచ్చపువ్వులాంటి వెన్నెల్లో కూర్చుని, ప్రభాకరం ఎన్నెన్నో విషయాలు - ఎన్నెన్నో అనుభవాలు దాపరికంలేకుండా అనూ రాధతో చెబుతూవుండేవాడు. కవ్వించేవాడు-నవ్వించేవాడు. ఆవెన్నెల్లోని స్వచ్ఛతే-అతడి చిరునవ్వులో కన్పించేది ఆమెకు. అంత నిర్మలమైన మనస్సుతో చనువుగా అతడలా మాట్లాడు తూంటే - తనకేదో తెలియని వేదన కలిగేది మనస్సులో.

నిజానికి తానుకూడా అతడిలాగా మనస్సువిప్పి మాట్లాడ కలుగుతోందా? ఆలోచిస్తూ అలాగే తల పైకెత్తితే - పైన చంద్రుడు, చంద్రుడిలో మచ్చ కన్పించేది. ఆమచ్చ కన్పించే సరికి మనస్సులో దిగులుపుట్టేది.

ప్రభాకరం అనురాగాన్ని వ్యక్తంచేస్తున్నకొద్దీ అనూరాధకు ఏదో తెలియనిబాధ్యత యెక్కువవుతున్నట్లు తోచేది. ఆమె అయినా అతడితో చెప్పటానికి సంశయించింది. ఒక్క వీణ విషయంమాత్రమే.అది చెప్పకపోవటమే బాధ్యత ఏమో?... అతడైనా మళ్ళా ఆవిషయం ఎన్నడూ ప్రస్తావించనేలేదు. అంతమాత్రాన మరచిపోయుంటాడా? ఆ అపశ్రుతి తొలగి పోయినట్లు తెలియందే ఎలా మరచిపోతాడు?

ఎప్పటికి పోతుందీ అపశ్రుతి?

మళ్లీ ...

ఒకనాడు ఆమె అద్దంముందర కూర్చుని తల దువ్వుకుంటోంది. రోజూకంటె ఆరోజున ముందుగానే వొచ్చాడు కోర్టునుంచి ప్రభాకరం. గుమ్మంలోకి వొచ్చేసరికి అద్దంలో ఆమె ప్రతిబింబం కన్పించింది.

"ఆ గుండెకింద నల్లగా ఉన్న దేమిటి అనూ?"

అమె పాపట వంకరరాకుండా తీసుకునే ధ్యానలో - ఆమాట వినే వరకూ అతడు వొచ్చినట్లు గమనించనేలేదు. విని వినటం

తోనే అంత అజాగ్రత్తగా కూర్చున్నందుకు సిగ్గుపడి పైట సరిగ్గాతీసుకుని – "ఎప్పుడో దెబ్బతగిలిన మచ్చ అయివుంటుం దది. అంతగా గుర్తులేదు. ఇటీవల చాలాభాగం శరీరంలో కలిసిపోయింది కూడా"

"ఆ మిగిలినభాగం కూడా శరీరంలో కలసిపోతే బావుండును. లేకుంటే నీ పచ్చని శరీరంమీాద. ఆమచ్చ వికారంగా ఉన్నది సుమీా!"

ఆమాట విన్నప్పటినుంచీ ఆమచ్చను సాధ్యమయినంత త్వరలో పోగొట్టుకోవాలనే ఆరాటం జాస్తి అయింది అనూరాధకు...

... ... ...

ప్రభాకరం ఓ వేశంగానే ప్రవర్తించాడని చెప్పాలి. ఆ అపశ్రుతి రవంతవున్నట్లు తోచగానే, దాన్ని మనస్సులో దాచుకుని మథనపడకుండా, ఆమెను అడిగేశాడు. తనపొరబాటుమూలంగానే ఆ అపశ్రుతి వొచ్చిందని తెలుసుకుంది అనూరాధ. ఆ వీణవిష యం అతడిమనస్సులో ఎంతబాధగావుందో వూహించుకుంటే తన మనస్సుకు మరింత బాధగావుంది. ఆవీణలో లీలగానైనా అపశ్రుతి వినిపించకుండా వుంటేనే కాని, అతడి మనస్సుకు శాంతి వుండదని నిశ్చయించుకుంది.

తనకైనా అంతేగా!

కాకపోయినా నిజానికి అది తనకు తెలియకుండా జరగదనీ, తాను కఠినంగా వీల్లేదని శాసించలేకపోవటం మూలంగానే

అలా జరిగివుంటుందనీ అతను మాత్రం వూహించుకో లేదూ !

ఇన్నీ తెలిసికూడా ఆరోజున నాకు తెలియదు, అని అబద్ధ మాడింది. అతడిమనస్సు నొప్పించింది. ఇదంతా జ్ఞప్తికి వచ్చే సరికి ఆమె మనస్సు 'చెయ్యేసి కలచి'నట్లుయింది.

... ... ...

అసలు సుధాకరం అనూరాధకు స్నేహితుడూ కాదు-బంధువూ కాదు. కాకపోయినా అన్న భాస్కరానికి స్నేహితుడవటం మూలంగా ఆమెకూ పరిచితుడు అయినాడు. భాస్కరం కోసం తరచు రానటంవల్ల- అంతో యింతో రాధతోకూడా చనువు యేర్పడ్డది సుధాకరానికి. అప్పుడప్పుడు భాస్కరం ఇంట్లో వున్నా లేకపోయినా, రాధతోనే కబుర్లు చెబుతూ మధ్యమధ్య కూనిరాగాలు తీస్తూ కాలక్షేపం చెయ్యటంకూడా మామూలయింది.

తన కా వీణను శ్రుతిచెయ్యాలనీ, ఆ సరదా ఆ అపేక్ష చాలా రోజులనుంచీ వున్నా ఇంతవరకు అవకాశం చిక్కలేదని, ఇవాళయినా తన సరదా తీర్చమనీ, అనూరాధను బ్రతిమాలాడు.

ఆ వీణను ఇతరులు శృతిచెయ్యటం అనూరాధకు ఇష్టంలేదనే అనవచ్చు. కాని వీణావాయిద్యం విని, ఎన్నాళ్ళో అయింది. తాత్కాలికమయిన సరదా కలిగినా కలిగిందేమో! ఏమయినా అతడి సరదాను కాదనలేక పోయింది.

సుధాకరం తనవాంఛ తీర్చుకున్నాడు.

ఒక శ్రుతి పాడయింది.

పాడయిందే అన్న ఆందోళన, ఆరాటం అనూరాధకూ కలిగింది. తొందరపడినందుకు... మనస్సు చివుక్కుమంది. ప్రభాకరం వీణ విషయం ప్రశ్నించిన నాటినుంచీ, తన పొరపాటుకు పశ్చాత్తాపపడింది.

ఇదంతా మరచిపోదామన్నా మరుపుకురాలేదు అనూరాధకు. ఇప్పటికి వొచ్చినప్పుడల్లా తెలియని భయంతో వణకిపోయేది. ఆనాడు మరీ కట్టలు తెగినట్లు దుఃఖం పొర్లుకుని వొచ్చింది. తన తెలివితక్కువ తనానికి, చాపల్యానికి తననే అసహ్యించుకుంది. అభిమానంతో క్రుంగిపోయింది; తెలిసీ తెలియని పరిస్థితిలో అలాగే పడివుంది మంచంమీద.

ప్రభాకరం వొచ్చాడు. కాని తనవేదనంతా అతడితో చెప్పుకునేందుకు ఆమె లేతగుండెకు నిబ్బరంలేక పోయింది.

'అలా ఉన్నావేం అనూ?' అన్నాడు ఆమెవైఖరిచూసి విస్తుపోతూ.

"కలతనిద్దరలేక పోవటంమూలంగా కళ్ళు అలా వున్నాయి" అన్నది మనసును కొంచెం కుదుటపరచుకుని. వెంటనే ప్రసంగం మార్చి కాఫీ చల్లారిపోతున్నది అంటూ కాఫీ అందించింది.

ఆమె అబద్ధం చెప్పిందని ఆ కంఠస్వరమే తెలియచేసింది. ముఖ వైఖరినిబట్టి ఆమె పడుతున్న బాధ కొంచెం తెలిసినట్లుగానూ కొంత తెలియనట్లుగానూవుంది. కాని అతడు తొందరపడి తరచి తరచి మాత్రం ప్రశ్నించలా.

*　　　*　　　*

ఎన్నివిధాల తప్పించుకుందామని ప్రయత్నించినా మదరాసు వెళ్లక తప్పిందికాదు ప్రభాకరానికి. వీలయినంత త్వరలో వొస్తానని అనూరాధను వొప్పించి వెళ్లాడు.

నాలుగోనాడు......

ప్రభాకరం వొస్తానని చెప్పిన రోజు అది. కళ్లల్లో వొత్తులు వేసుకుని అనూరాధ అతడికోసం యెదురుచూస్తోంది.

సుధాకరంవొచ్చాడు.

'ఇలా ఎందుకువొచ్చాడా' అనిపించింది అనూరాధకు.

సుధాకర రావటం ఆమెకు ఇష్టంలేనిమాట నిజమే; కాని ఇంటికి వొచ్చిన వాడిని పల్కరించనంత విరోధమేముంది ?

సుధాకరానికి అనూరాధ చాలాకొత్తగా కన్పించింది.

ముక్తసరిగా పలకరించింది ఆమె.

తనురావటం ఆమెకెంతో ఉత్సాహాన్ని కలిగిస్తుందని ఆశపడ్డ సుధాకరానికి, ఆమెముఖంలో అలాంటి చిహ్నాలేవీ కన్పించక పోయేసరికి ఎంతో నిరుత్సాహపడ్డాడు.

ఛలోక్తులతో చమత్కారాలతో కూనిరాగాలతో ఆమె కేదిధంగానైనా ఉత్సాహాన్ని కలిగించాలని ప్రయత్నిం చాడు.

ఊహూం. ఆమెలో మార్పు కనిపించలా.

"ఇన్నాళ్లకు మళ్లీ నిన్ను ఇవ్వాళ కలుసుకోవటం ఎంత ఆనందంగా ఉన్నదనుకున్నావు రాధా!"

కొత్తముఖంవైపు చూచినట్లు వింతగా చూచింది.

ఆమె వైఖరి అంతా గర్వమేమో అనుకున్నాడు. పాత పరి చయాన్ని జ్ఞప్తికి తెచ్చుకునైనా తనతో సరదాగా మాట్లాడ కూడదూ?'—అన్న విషయం అతని మనస్సును చాలా వేధిం చింది.

"ఇవాళ మళ్లా..."

"ఊఁ. మళ్లీ?"

ఆమెకంఠస్వరంలో కొంత కాఠిన్యం ఈసడింపూవ్యక్తమయాయి. ఆముఖంలో మరింత ప్రతికూలమయిన మార్పు కన్పించింది.

"ఈసినను శ్రుతిచెయ్యాలనే..."

చెప్పతలచుకున్నది. మాట పూర్తిగా చెప్పటానికి ఆమె ముఖం చూసి చెప్పలేకపోయాడు. ఆమాటవినేసరికి అనూరాధకు శరీర

మంతా జలదరించింది. కాళ్ళక్రింద భూమికదలుతున్న ట్లయింది. అభిమానంతో శరీరం కుంగినట్లయింది.

“వద్దు సుధాకరం? ఇంక ఈ వీణను నువ్వు తాకటానికి వీల్లేదు.” అతి ప్రయత్నంమీద అంతవరకు అనగలిగింది.

అతనికి నవ్వొచ్చింది ఆమెవైఖరికి. ఆ నవ్వులో అహంభావం కూడా వ్యక్తమైంది.

“ఏం? ఎందుకని...?” అన్నాడు ఎకసక్కెంగా.

“ఆమాట నన్ను అడగవద్దు”

“చిరాకుగా ఉన్నట్లున్నావు. శరీరంలో కులాసాగా లేదా రాధా! కాకపోతే వద్దనటంలో కారణం ఏముంటుంది?”

ప్రభాకరం ఎక్స్‌ప్రెస్ దిగివొచ్చాడు గంట ఆలస్యంగా. మేడ పైకి వెళ్లాం. మాటలువినపడుతున్నాయి.

“అప్పుడు ఈ వీణ విలువ తెలియక అజ్ఞానంతో నువ్వు శ్రుతి చెయ్యబోతే అడ్డు చెప్పలేకపోయాను. అందుమూలంగా వొచ్చిన నష్టాన్ని, తర్వాత కాని తెలుసుకోలేక పోయాను”

పక్క వరండాలో నిల్చున్నాడు ప్రభాకరం.

“ఏం గుర్తించావు రాధా! అరిగిపోయిందా? విరిగిపోయిందా?

“అనవసరంగా పిచ్చిగా మాట్లాడకు సుధాకరం! అపశ్రుతి పలికింది చాలదూ? ఆ అపశ్రుతిని సరిదిద్దుకోటానికి ప్రయత్నిం

చాలి; కాని అలాగే ఎప్పుడూ అయితే..." ఆపైన చెప్పలేక పోయింది. ఆమెముఖం జేవురించింది.

"అది నీ భ్రమకాని, మరేం ఫర్వాలేదు రాధా!"

"ఒక్కసారి పొరపాటు పడ్డాను; అయిపోయిందేమో అయి పోయింది. ఇంకనువ్వు ఆ ప్రసక్తితీసుకురావద్దు సుధాకరం"

"ఎంతో ఆశతోవచ్చాను రాధా! ఈ ఒక్కసారికి నా సరదా"

"ఈసారి ఎలా అన్నావో, మరోసారికూడా అలా అనలేవూ? దయవుంచి ఆవిషయాన్ని మరచిపో"

"ఇంత సరదాతో వొచ్చిన నన్ను నువ్వు కాదన్నావంటే నా మనస్సు వికలమౌతుంది రాధా!"

"అర్థం కాలా నీస్వార్థం? ఇప్పటికి ఈ అపశ్రుతిమూలంగా నా మనస్సూ, నా మూలంగా ప్రభాకరం మనస్సూ ఎంత బాధ పడ్డాయో నీకేం తెలుసు?"

"నువ్వు అంత నిష్కర్షగా మాట్లాడితే_"

"ఆర్గ్యుమెంట్ కోసం ప్రయత్నించకు సుధాకరం! మర్యాదగా వెళ్ళిపోరాదూ ఇక్కణ్ణుంచి?"

ఆమాట వినేసరికి అతడికి తనకోరిక తీరలేదనే ఉక్రోషం—

కలిగింది. తనకోదో అవమానం జరిగినట్లుగా కూడా తోచింది. దాంతో అసూయకూడా యేర్పడింది. మొండికేశాడు.

"నువ్వేమన్నా సరేకాని రాధా! ఈ తఫాను ఈ వీణను శ్రుతి చెయ్యకుండా వెళ్ళను. వెళ్ళలేను."

అనూరాధకు ఏంచెయ్యాలో తోచలా. అప్రయత్నంగా ఆవేశమూ - ఉద్రేకమూ రేకెత్తాయి ఆమెలో...

"ఏమిటా అధికారం సుధాకరం! ముందు వెళ్ళిపో ఇక్కణ్ణించి. కదులుతావా కదలవా?" కాళికలాగా గర్జించింది. అంతవల్ల కలిగిన ఆయాసంతో సోఫాలో కూలబడింది.

అంత సుకుమారంగా వుండే అనూరాధలో ఇంత తీవ్రత్వం ఎలావచ్చిందో అర్థంకాలా అతడికి ఉలిక్కిపడ్డాడు. గుండెలు తీవ్రంగా కొట్టుకుంటున్నాయి. ఏంచెయ్యటానికి తోచటంలా. ప్రభాకరం వొచ్చాడు లోపలికి.

"సుధాకరం!" అన్నాడు తేలికయిన నవ్వుతో...

అతడికి గుండె ఆగినట్లయింది. తలవొంచుకుని ఆ మెట్లన్నీ దిగి వెళ్ళిపోయాడు సుధాకరం.

... ... ...

చంద్రుడు కొంచెం పైకివచ్చాడు. అడ్డంగావొచ్చిన మబ్బుతెర తొలిగిపోయింది. చంద్రుడులో మచ్చవున్నా ఆ నలుపువల్ల వెన్నెలలో తెలుపు తగ్గలేదు. మబ్బును చీల్చుకునిరావటం

మూలంగానేమో మరింత కాంతిగా ఉన్నాడు చంద్రుడు. ఇక

మన్మసంగతి ఎవరు ఆలోచిస్తారు?

ప్రభాకరం వీణను కదిలించి శ్రుతిచేశాడు. అపశ్రుతి లీలగా

నయినా ఉన్నట్లు తోచలేదతడికి.

షడ్జమస్వర మాధుర్యంలో అనూరాధ కంఠమాధుర్యం ఐక్య

మైంది. మన్మకయినా లేదు ఇప్పుడామె గొంతులో జీర.

# మ స క మ బ్బు లు

నిన్నటిలాగా ఇవాళకూడా చందమామే సాయమయ్యాడు—హోటల్ మారిస్‌నుంచి బయలుదేరిన మాధవరావుకు. శరీర మంతా తిమ్మిరిగావుంది. మరో అరపెగ్గు వేస్తే ఎక్కడ పడి పోయేవాడో! ఒడలుమరపిస్తున్న మైకాన్ని నిగ్రహించుకుంటూ తిరగరాని సందులవెంట ఇంటికి తిరిగివస్తున్నాడు.

బూచులు బూచులుగా అడ్డంవొస్తున్న మసకమబ్బుల్ని చెదర కొట్టుకుంటూ మధ్యమధ్య చందమామ ప్రత్యక్షమౌతున్నాడు. అతడూ ఇంటికే కాబోలు ప్రయాణం!

ఇల్లు... అన్న దానికేమిటో నిర్వచనం! ఏవేళ కింటికి వొచ్చినా ఆదరించి ఆప్యాయనంగా పల్కరించి గుక్కెడు మంచినీళ్లయినా ఇచ్చే ఇల్లాలు లేక పోయింత ర్వాత... అదీ ఇల్లేనా?

ఇల్లుఉన్నా లేకపోయినా అంటిపట్టుకుని తిరిగే ఇల్లాలుడు ఇరవైయేడుగురుట చందమామకు! అబ్బ! అప్పటికీ సంతృప్తిని లేకనే కాబోలు తారావధూటిని చేరబోయింది! ఎందుకో ఈ అర్ధరాత్రి సంచారం — తనలాగా మామయ్యకు.

ఆ ర వై యే డు

తాత్కాలికమైన సంతృప్తి తామరాకుమీద నీటి చుక్కలాంటి దేమో!

అడుగులు లెక్కపెట్టుకొంటూ, తూలిపోతున్న శరీరాన్ని సంబాళించుకుంటూ - మసక నిద్రలో వస్తున్న మాధవరావు శప్పీమని ఆగిపోయాడు.

ఎక్కడిదో ఆసంగీతం! ఏలోకపు మాధుర్యం అది. గాలంవేసి లాగినట్లు లాగుతోంది మనస్సును. మరపున పడిన యే భావనలనో మళ్ళీ ప్రేరేపిస్తోంది. ఆ ఫిడేలుమీది కమాను తీగెల మీదినుంచి కాక తన నరాలమీదనుంచి లాగుతున్నట్లుంది. కొనుక్కొని తెచ్చుకొన్న మైకంకన్న వివశుణ్ణి చేస్తోంది. ఎంత ప్రయత్నించినా అడుగు ముందుకు సాగడంలేదు.

జాలిగా వినిపిస్తున్న ఆ పాట జాలుగ్రహించి ఆవైపుకే నడిచాయి పాదాలు.

ఓరగా వేసివున్న గేటు తెరచి, మసక వెన్నెల్లో మేడ మెట్లు ఎక్కాడు.

మామిడిచెట్లల్లోంచి మసకనీడలు మెట్లమీద ప్రసరిస్తున్నాయి. అర్ధరాత్రి దాటినా 'నిద్రకు వెలియై... తానొంటరియై... చీకటిలోపల ఆగదిలో' సౌఖ్యానికి కరువువాచి, అణచుకోలేని ఆవేదనతో ఆలాపిస్తున్నట్లుంది ఆ పాట. ఎవరో ఆ అభాగ్యురాలు!

ఆ ర వై యొ ని మి ది

మాధవరావు పాదాలచప్పుడు ఆ మధుర సంగీతానికి ఆటంకం కలిగించినట్లేవుంది.

మసకనీడలు కూడా మాయమైనాయి.

చటుక్కున స్విచ్ వేసి తలుపు తెరచింది ఆమె. ఆ యెలక్ట్రిక్ దీపపు కాంతికో, ఆ కాంతిలో మెరసిపోతున్న అమె సౌంద ర్యానికో అతడికళ్ళు జిగేలుమన్నాయి. బయర్లు కమ్మాయి. ఇహా తానక్కడ తారట్లాడటంలోని తప్పును గ్రహించి వెనక్కు తిరిగాడు.

"ఎవరు తమరు ?"

"ఎంతో కటువుగా వినిపించటానికి బదులు ఎంతో చనువుగా విన్పించింది ఆ కంఠస్వరం.

"నేనా ? క్షమించాలి !"

అంటూ తత్తరపాటుతో మెట్లు గబగబా దిగుతున్నవాడు-కాలు ముడతపడి క్రిందకు దొర్లిపోయాడు.

ఎవరో తెలియక తెల్లబోతున్న ఇందిర భయపడింది. 'పాపం' అని నొచ్చుకుంటూ క్రిందికి దిగివొచ్చి ఆసరాయిచ్చి లేవ తీసింది.

దూరాన ఎక్కడో రాలిపోయింది నక్షత్రం...

అతడిముఖాన్ని స్పష్టంగా పరిశీలించింది. సహించరాని వాసన

వేస్తున్నా అతడికి సపర్యలు చేయకుండా ఉండలేకపోయింది. ఎవరైతేయేం? పాపం పట్టుమని పాతికేళ్లయినా లేని ఇతడికేదేమిటో దురవస్థ? తానెవరో చెప్పటానికే మొగమాటపడిన అభిమానవంతుడు ఎలాయెక్కాడో మరి మేడమెట్లు! ఇందిరకీ సంఘటనంతా చిత్రంగా తోచింది.

తగిలిన దెబ్బకు స్మృతితప్పటమో, తాగిన మైకమో మాధవరావు మన లోకంలో లేడు. ఎన్నివిధాలో అతడికి స్మృతికలిగించాలని ప్రయత్నించింది ఇందిర. చివరకు మళ్ళీకమాను కదిలించింది. అంతర్లోకంలో ఉన్నవాడుకూడా ఇంతదూరం రావటానికి అదే కారణమని అనుకుంది. కొండరాళ్ళమీది సెలయేటి ప్రవాహంలా ఆ సంగీతం అతడి నరాలమీద ప్రవహించి చక్కిలిగింతలు పెట్టింది. శరీరం ఝల్లుమంది. విరుగుడు తగిలినట్లు వదులుతోంది మత్తు.

కళ్ళు తెరచాడు. ఒక్కొక్కటే అన్నీ జ్ఞాపకం వొస్తున్నాయి. కాని తాను ఆ గదిలో ప్రవేశించేటంత సాహసంకూడా ఎలా చేశానా అని సిగ్గుపడ్డాడు. ఎదురుగా ఉన్న నిలువుటద్దంలో తలకు కట్టిన కట్టు కన్పిస్తోంది. ప్రక్కనే ఉన్న ఇందిరను చూచి కలేమో అని అనుకుంటున్నాడు.

'అబ్బ' అంటు ప్రక్కకు తిరిగాడు తల పట్టుకొని.

ఆమె దగ్గరగా వొచ్చి 'బాధగావుందా? దాహం వేస్తున్నదా?'

ఔషధ

అంటూ హాస్యాన్ని కలిపియిస్తూ, 'అంత ప్రమాదమైన దెబ్బ కాదు. భయపడాల్సిన అవసరం లేదంటూ ధైర్యాన్ని చెపుతోంది.

'తనవి కావు... ఏమిటి ఈ ఆదరణ?' ఆలోచిస్తూనే అలసటతో కళ్ళు మూసుకున్నాడు.

మళ్ళీ మెప్పుడు మెళుకువవస్తుందో అని, ఇందిర అలాగే కళ్ళల్లో వొత్తులు వేసుకొని కూర్చుంది.

—మాధవరావు ఎవరో తెలుసుకోవాలని ఇందిర కొంత ఆపేక్షపడ్డా, సమయం కాదని అలాగే అణచుకుంది.

అతడూ మనలాంటి వాడే. లోకం అతణ్ణి రాక్షసుణ్ణిగా పరిగణించింది; కాని నిజానికి ఇంతవరకు అతడిలో రాజసమూ లేదు, రాక్షసత్వమూ లేదు. సుఖదుఃఖాలను సమంగా పంచుకోటానికి సావిత్రి వొచ్చిన దగ్గర్నుంచీ అతడిలో కొంత మార్పు వొచ్చింది. ఆమె కోసమని అతడు ప్రాకులాడినకొద్దీ ఆమె మోసగించ సాగింది. ఆ మోసం ప్రత్యక్షమైననాడే అతడికంతా కనువిప్పు అయింది. అవపరకుదాకా సావిత్రిని గురించి ఎన్ని విన్నా పట్టించుకోనివాడు, ఆనాటినుంచి తనకెందుకులే అని తప్పించుకు తిరగలేక పోయాడు.

ఆ నాడది చెదురుపాటుగా తగిలినదెబ్బ కాదు; చెళ్ళుమన్నది చెంప అతనికి. మరోసారికూడా ఈలాంటి సంఘటన తటస్థిస్తే?

ఆ ప్రశ్నే అతణ్ణి మథించి, మనఃస్థిమితాన్ని చెడగొట్టింది. సహనాన్ని కూడా చంపింది.

ఈ భాగ్యానికి అంతదూరం ఊహించాలా అనుకున్నారు కొందరు. కాని అతడి ఊహే నిజమైతే వీరు చూపించేది సానుభూతేగా చివరకు.

అది తలచుకుంటే శరీరమంతా గగుర్పొడిచింది మాధవరావుకు. ఆ నాటినుంచి అద్వితీయుడైనాడు.

ఈ మార్పుకు అతణ్ణి రాక్షసుణ్ణిగా భావించారు కొందరు. "పోనీ... మళ్లీ..." అంటూ సలహాలు విసిరారు. అన్నిటి కన్నా చవుకగా లభించేవి సలహాలేగా!

ఈ సలహాదార్లనందర్నీ సమాధాన పరచటం అతడికి చేత కాలేదు. జరిగిందంతా-ఎంత యథార్థమయితేమాత్రం-యెలా చెప్పటం? 'సిగ్గు లేక ఎలా చెప్పుకుంటున్నాడో ఏదోవిధంగా సరిపెట్టుకుపోక' అంటూ అప్పుడుమాత్రం యెత్తిపొడవరూ?

అంతేకాని తన గుండెల్లోని బాధ, మనస్సులోని మంట ఎవరు తెలుసుకుంటారు! ఎవరి కవసరం?

కనుకనే ఎంతమంది వొచ్చినా పెదవి కదల్చేవాడు కాదు. పెదవికదల్చనందుకు ఫలితంగా మరి కొన్ని అపవాదులను అంట కట్టుకున్నాడు.

డెబ్భై రెండు

—మల్లెపూవు చూచినా మనస్సు చలించే వయస్సు.
మహారాజ్యాధిపత్యం వచ్చినా మాన్పుకోలేని గాయం.

మనస్సును అన్యథా ప్రలోభపెట్టి, పసిపిల్లవాణ్ణి మరపించినట్లు మరపించాలనుకూడా చూశాడు మాధవరావు.

ఎంత కంటికి కనిపించని దయితేమాత్రం—ఆ మనస్సే ఆయెను—ఎన్నాళ్ళని ప్రలోభపడుతుంది.

మనస్సుని స్వాధీనపర్చుకోవాలని ప్రయత్నించి, తానే స్వాధీనమయినాడు మనస్సుకు. ఇహ యిప్పుడతనికి ఏ చిన్న లేత రెమ్మయినా, ఏ కోకిల కూతయినా గిలిగింతలు పెట్టక మానటం లేదు.

పగలల్లా యెలాగడిచినా, చీకటిపడింది అనేసరికి యేదో కొత్త జీవం కలిగినట్లు—డేది. ఎన్నో మధురానుభవాలు, మధుర భావాలు, ఎంత వద్దనుకొన్నా, అనుకొని ఎంత దూరనూరంగా జరిగినా, వెంటతరిమి, పలకరించి, కవ్వించి, వేధించేవి. తాత్కాలికంగా వాటి బాధతప్పించుకోటానికి, వాటిని మరచినట్లు నిర్లక్ష్యం చెయ్యడానికి కొంతమత్తు అవసరమేమో అని తోచి హోటల్ మాకిన్‌కు వెళ్ళడం అలవాటుపడ్డాడు.

... ... ...

—మెలకువ వచ్చేసరికి తనమీద తనకే అసహ్యం వేసింది.

డెబ్భై మూడు

అక్కడనుంచి వెళ్ళిపోవాలని ప్రయత్నించాడు. కాని వెళ్ళ లేక పోయాడు.

'ఇందిర ఎవరు'? తనలాంటి అపవిత్రుడు ఆమె ఆదరణ పొంద డానికి అనర్హుడేమో అనిపించింది. కాని ఆమె ఆదరణే అతడు కదలలేక పోవడానికి కారణమూ అయింది.

గతాన్ని స్మరించినకొద్దీ జ్ఞాపకాలతో గుండె రగిలేది. ఆమె ఎంత వద్దని వారించినా, మారిస్‌నుంచి మైకాన్నిమాత్రమూ తెచ్చుకునే వాడు.

ఇహ ఇందిర ఆమైకంలో అతనిచేత ఎన్నెన్నో వాగించేది. ఆమెకు జీవితంలో ఏయే సంఘటనలకు మనస్సు చిటుం కట్టి ఇతణ్ణి చూసేసరికి జాలికలిగిందో! ఏ అనుభూతి సామ్యాలు అంత చనువును కలిగించాయో! రానురాను ఇందిర సర్వా త్మనా అతడికి లొంగిపోయింది.

ఇందిర ఎవరో తెలుసుకోవాలని ఎంత యిచ్ఛవున్నా, అతడు తెలుసుకోలేక పోయాడు. వెనకముందు ఆసరా లేకుండా అలాంటి వయస్సులో ఆమె వొంటరిగా వుండటం అతడికెంతో ఆశ్చర్యాన్ని కలిగించింది.

నిద్ర లేచిందగ్గర్నుంచీ, కాఫీ అందియటం లగాయతు ఇందిర అతడికి ఏ వెలితీ లేకుండా చూచేది. తాత్కాలికంగా కలుసు కున్న వారిద్దరిలో అంత తాదాత్మ్యం ఎలా ఏర్పడిందో!

—"ఇలా పాడై పాపం సావిత్రిని తరిమేశాడు కాబోలు"అని సావిత్రిమీద సింపతీ కనబరిచేవారుకొందరు.

"తక్కువ వాళ్ళెవరోయ్ సమాన ఉజ్జీలు!" అనుకుని సంతృప్తి చెందినవాళ్లూ ఉన్నారు.

"ఇది వుంటేమాత్రం మళ్లీ సావిత్రినికూడా తెచ్చుకోకూడదూ? ఎంతమంది లేరు అలా లోకంలో"—అన్నవాళ్లూ లేకపోలేదు, కొంతమంది శ్రేయోభిలాషులు.

అంతేకాని ఇతడిలాయెందుకు మారాడు ? అన్న ఆలోచన ఒక్కరికయినా తోచలా.

ఆధారములేని గాలిని పోగుచేసి దానికో ఆకారాన్ని కల్పిస్తుంది లోకం. కాని ప్రత్యక్షంగా కనిపించే విషయాన్ని చూడనే చూడదు. ఇంక పరిశీలించటంకూడానా!

... ... ...

ఎంత మసకమబ్బులు వేస్తున్నకాలమే అయినా, మధ్యమధ్య సూర్యరశ్మి సోకకుండా ఉండటమూలేదు. మసక మబ్బులు మాయం కాకపోవటమూలేదు.

స్మృతిలోకాని, విస్మృతిలోకాని, ఇందిరతో అతను పొందిన ఆనందమే - అతడి జీవితములోని బ్రహ్మానందం; కాని సర్వదా అలా జరిగిపోవటానికి సర్వహక్కులతోనూ ఇందిర మాధవ రావుకు స్వంతంకాదు.

డెబ్భై అయిదు

ఆ హక్కులను భుక్తపరచుకొనే ప్రబుద్ధుడు ఇన్నాళ్ళకు కళ్ళు తెరచి – ఇందిరను చేరతీసుకున్నాడు.

ఇహ నిప్పుడు నిందిర దర్శనంకూడా కరువైంది మాధవరావుకు. మళ్లీఒంటరిగా నిలబడవలసివచ్చేసరికి గాయంసెల వేసినట్లైంది.

—అసలే ప్రతి స్వల్పమైన దానికి విలవిలలాడే స్వభావం అతడిది. సెలవేసిన గాయపుబాధను ఎలా సహించగలడు ?

ఇహ అతడికి ఒక్కటే అలవాటయింది. పగలల్లా బయిటికి కదలక పోవటం. రాత్రల్లా ఇంటికి రాకపోవటం !

వీలునుబట్టి స్పెన్సరులోనో, మారిస్‌లోనో మకాం వెయ్యటం, అవకాశాన్నిబట్టి డబ్బుతో సుఖాన్ని కొనుక్కుందామనే అధమ దశలోకి కూడా జారాడు.

... ... ...

రాత్రి దాదాపు తొమ్మిదవుతుంది. స్పెన్సరులో కూర్చుని, సిగరెట్ మీద సిగరెట్, పెగ్గుమీద పెగ్గు త్రాగుతున్నాడు.

అతడికి ఆనాడు మరీ ఆశ్చర్యం కలిగించిన విషయం – అధమం ఆంగ్లోయిండియన్ అయినా కాని–ఆమె ఎదురుగా టేబిల్ దగ్గర వొంటరిగా కూర్చుని తనలాగానే పెగ్గుమీద పెగ్ తీసుకుంటూ వుండటం.

చెక్కిళ్ళమీద ముడతలు వయస్సు చెల్లినట్లే సూచిస్తున్నాయి. కళ్ళల్లోని తళతళకూడా తరిగినట్లే కన్పిస్తోంది. ఎంతో జీవి-

ఆ ఖై ఆ రు

తాన్ని, లోకంలోని సౌందర్యాన్ని అనుభవించినా తీరని 'కుతి' ఆమె ముఖంలో కన్పిస్తూనే వుంది.

ఎదటి వ్యక్తిని ఆకర్షించాలని ఆమెచేసే ప్రయత్నం అతడికి మరింత ఆవేశాన్ని రేకెత్తించింది. ఎందరెందరో వొస్తున్నారు. ఎందరెందరో వెడుతున్నారు. అందులో కొందరు పూర్వ పరిచితులు కాబోలు, ఎంతో మర్యాదగా పల్కరించి, సర్వంగా సరసాలాడుతున్నారు.

ఆమె యెవరైవుంటుంది అన్న ఆలోచన కలిగిందతనికి. మరో పెగ్‌తో గ్లాసు ఖాళీచేసి, ఆమె టేబిల్ దగ్గరకు చేరాడు—పూర్వపరిచితుడిలా పల్కరిస్తూ.

అతడు పల్కరించేసరికి ఆమెశరీరం ఝల్లుమంది. అతడికళ్ళల్లో మత్తు ప్రతిఫలిస్తోంది.

ఒక్కొక్కప్పుడు నిజంగానే యింతకనరు తాగటం ఎలా అలవాటు చేసుకున్నాడా అనిపిస్తుంది. ఊం. జీవితాన్ని తాగడం కన్న కనరా...?

ఆమెకూడా పల్కరించింది.

అతడి శరీరం పులకరించింది.

ఆమె ఆపాదమస్తకం అతణ్ణి పరిశీలించింది. బెదురు బెదురుగా వెనక్కి తగ్గింది.

ఆమెచూస్తున్నకొద్ది అతడి శరీరం కంపరమె ్తంది. మోతాదు ఎక్కువ పడ్డదేమో అనుకున్నాడు.

ఆమెకు గడిచిన జీవితమంతా కళ్ళల్లో తిరుగుతోంది. కళ్ళల్లో నీళ్లు తిరిగాయి.

"మీరు కొంచెము యెక్కువగా మోతాదు తీసుకున్నారేమో! ఏమైనా ట్రాంక్విలైజర్ అయినా తీసుకుంటారా?" అన్నాడు.

"అవసరం లేదు" అన్నది ఆమె.

"లోకాభిరామాయణం ప్రారంభమైంది. లోకంమీద జీవితం మీద, ఎవరికి తోచిన సూత్రాలు వాళ్లు రచిస్తున్నారు. మధ్యమధ్య వ్యాఖ్యానాలు చేస్తున్నారు.

—"మనం ఈ రాత్రికలిసి ఉండిపోకూడదూ ?" అన్నాడు. హఠాత్తుగా పర్సుబరువు చూచుకుని.

"అవును. ఈ రాత్రి అన్నమాటేమిటి? ఇహ యెప్పుడూ మాత్రం ఎందుకు కలిసి వుండకూడదూ ?"అన్నది నవ్వుతో.

ఆ మాటలో అంతరార్థం ఉన్నట్లు అతడికి అవగాహన కాలేదు.

"ఓ ఎందుకు కూడదూ?" అన్నాడు నవ్వుతూనే. ఇద్దరూ మళ్లీ రెండుగ్లాసులు ఖాళీచేశారు.

ఇంక లేద్దామా అనుకున్నారు. మాధవరావు తాను వొచ్చిన టాక్సీమీదనే ఆమెతోకూడా ఇంటికి చేరుకున్నాడు.

■ తొమ్మిది

మేడమీద గదిలోకి వెళ్ళింతర్వాత, ఆమె అడిగిన ప్రశ్నకు సమాధానంగా చెప్పాడో, లేక తనంతట తానే మైకంలో అన్నాడో.

"నా భార్యే... నన్నీస్థితికి... తీసుకునివొచ్చింది. madam!" అన్నాను.

ఏదో ఛట్టాన వెన్నులో పొడిచినట్లయింది. ఎంతమైకం వున్నా న్నా జ్ఞాపకాలు గిల్లినట్లు స్ఫురిస్తాయి.

తన చేతుల్లో-కాదు కౌగిలిలో - నలిగిపోతున్న ఆమెను ఒక్కసారి తేరిపార చూచి, ఒక్కతోపు తోసి;

"నువ్వా... నువ్వేనా సావిత్రీ! మళ్ళీ ఇక్కడా సిద్ధమైనావా?" అంటూ ఆపుకోలేని ఆవేశంలో టేబిల్ మీద వున్న సీసా రవీమని కణత పగిలేట్టు విసిరాడు—



# అశ్వమేధం

పడియుంది పెద్దలూ పామయ్యానే తీర్పు చెప్పమనటంలో కూడా కొంత సబబు లేకపోలేదు.

ఇప్పుడీ తగాదాలు పడుతున్న చలమయ్య - బసవయ్యలు గుర్రాలు కొనడానికి కారకుడు కొంతవరకతడే అనిచెప్పొచ్చు. షైలాపచ్చీసుగా ఉన్నవాళ్ళకి, ఏదోవిధమైన వ్యామోహం, మోజుకల్పించి, వాళ్ళు అందులోపడి తన్నుకుంటూంటేచూచి ఆనందించే బాపతు పామయ్య. చలమయ్య, బసవయ్యలకు వచ్చిన తగాదాకూడా గుర్రాన్ని గురించే.

ఒకప్పుడు సరదాగా స్వారికనికొన్నాడు ఓగుర్రాన్ని పామయ్య. స్వారిచెయ్యడానికది అంత అనుకూలించకపోయేసరికి దానికి చక్కగా ఆటనేర్పించి ఆట గుర్రాన్నిగా తయారు చేయించాడు. ఆరోజుల్లో పెళ్లిళ్ళకు భోగం మేళాలు పెట్టడం ఘనతా - ఫ్యాషనుకూడా. కాని పామయ్య తన వూళ్ళోనే గాక, చుట్టుపక్కల వూళ్ళల్లోకూడా, భోగంమేళంతోపాటు, గుర్రపుమేళంకూడా ఫ్యాషన్ అవడానికి యెంతో ప్రయత్నించాడు. అతని ప్రయత్నం ఫలించి పల్లెటూళ్ళలో అది ఫ్యాషనుగా ప్రబలుతూన్నకొద్దీ, అతడిగుర్రానికి దూరపువూళ్ళనుంచీ

కూడా ఆహ్వానాలు రావటం ప్రారంభమయినాయి. ఆ ఆహ్వానాలు అలిడికి ఆర్థికంగా లాభిస్తున్నాయికూడా. అది జూచి పామయ్యమీద పోటీకోసం చలమయ్య - బసవయ్యలు భాగస్వాముల్లైపన్నెండువందలకు కొనుక్కొచ్చారు-ఓ భారీగుర్రాన్ని. బసవయ్య చలమయ్యకు వందకు పింతొండ్రి.

చలమయ్యకు అసంతృప్తిగానే వుంది కొన్నదగ్గర్నుంచీ. ఆరువందలు తన భాగానికి ఖర్చుపెట్టినా గుర్రంమాత్రం స్వంతం కాలేదని. అదీగాక ప్రతిస్వల్ప విషయంలోనూ బసవయ్యను సంప్రదించాల్సి వొస్తోంది. అందుకు మరీ చిన్నతనంగావుంది. అందుకని మరో ఆరువందలు పెట్టి ఇంకో చిన్న గుర్రాన్ని కొన్నాడు స్వంతంగా. అప్పటినుంచి బసవయ్య పేచీలు ప్రారంభించాడు - ఈ గుర్రంలోకూడా తనకు భాగంవుందని. ఇద్దరూ అసలు భాగస్వాములే; కనుక ఊళ్ళో పెద్దలు కొందరు ఉంటే ఉండవచ్చు నన్నారు వీళ్ళమోజుచూసి, పామయ్య [illegible] గుర్రాన్ని గుట్టుగా అమ్ముకున్నాడు పోటీ లాభంలేదని.

“ఇద్దరంభాగస్వాములం, రెండుగుర్రాలూ ఉన్నాయి; కనుక నా భాగానికి మొదట కొన్న పెద్ద గుర్రాన్ని తీసుకుంటా”నంటాడు బసవయ్య.

“నువ్వు పెద్దగుర్రంలో నీభాగానికి ఇచ్చింది ఆరువందలు. కావాలిస్తే ఆ ఆరువందలకు చిన్నగుర్రాన్ని తీసుకున్నానంటే:

లేదా మామూలుగా ఇదివరకులాగా భాగం భాగంగానే ఉంచుకో. అగ్రహారంమీద వచ్చే ఆదాయం చెరిసగం తీసుకుంటాం. అందుకూ కాదంటావా, నీ ఆరువందలూ వడ్డీతో అణాపైసలతో ఇచ్చేస్తాను. రెండుగ్రహారాలూ నాకే వదలినా సరే. అంతే కాని ఆరువందల భాగానికి పన్నెండువందల రూపాయల గ్రహారాన్ని ఎలా యిస్తాను?" అంటాడు చలమయ్య.

అందుకు 'ససేమిరా' అని ఏమయినా పెద్దగ్రహారమే కావాలన్నాడు బసవయ్య. ఊళ్ళో హంగుదార్లు కొందరు 'పెద్దగ్రహారం నీకే రావాలోయ్ ఎలా రాకపోతుందో చూద్దాంగా' అని భరవసాయిచ్చారు బసవయ్యకు. ఈ పేచీ తీర్పు చెప్పే భారమే ఇప్పుడు పామయ్యమీద మోపారు.

పామయ్య ఉభయులకూ కావలసినవాడే. పైగా అతిలౌక్యంగా ఎవరితోనూ పేచీలు లేకుండా, పెద్దమనిషిగా చలామణీ అవుతున్న ఘటం. గ్రహారాలవిషయంలో అనుభవమున్న అభినవ నకులుడు. కాని ఎవరికి అనుకూలంగా సలహాచెప్పినా తీర్పు యిచ్చినా రెండోవారితో విరోధం తెచ్చిపెట్టుకున్నట్లు అవుతుంది.

పామయ్యకు ఏమీ పాలుపోయిందికాదు. చివరకు దీనికో యుక్తి పన్నాడు. అదృష్టాని అంచనాకట్టి. ధర్మంమీద భారంమోపి, లౌక్యంగా "మీ ఇద్దరి వ్యవహారాల్లో రహస్యం మీకే తెలియాలి. మీలో ఎవరు చెప్పింది కాదంటానికి సాక్ష్యం లేదు;

కనుక మీరిద్దరూ గుర్రాలకు చీట్లువేసుకుని న్యాయంగా ఎవరికేదివస్తే దాన్ని తీసుకోండి" అన్నాడు..

ఈ తీర్పుకు అక్కడచేరిన పెద్దలంతా ఎంతో మెచ్చుకున్నారు. అంతా అంగీకరించినదానికి తాను కాదనటం పెద్దమనిషి తరహాకు భంగమని తలవ్రాగించాడు చలమయ్య. బసవయ్య మాత్రం న్యాయం, ధర్మం గెలుస్తాయేమో అన్న భయంతో బెరుకుబెరుగ్గా, తప్పనిసరిగా సరే అన్నాడు.

అయితే ఈ చీటీలు తీయించటం ఎవరిచేత అని సందేహం వొచ్చింది. అందరిదృష్టీ పెద్దగుర్రానికి ఆటనేర్పుతున్న కాసిం మీద పడింది.

అవును. కాసింకన్న అమాయకుడూ, నిజాయితీ కలవాడూ మరొకడు లేడు. పైగా కాసింకు అక్షరజ్ఞానంకూడా లేదు. పెద్దగుర్రంలో భాగంలాగానే బసవయ్యకు కాసింలో కూడా సగభాగం వుంది.

ఈ చీటీలు తీయించటం పర్నాటికి వాయిదావేశారు. ముందుగానే కాసింని పిలిచి వాడికి లంచమిచ్చి లాలోచీ అవుదామని చూశాడు బసవయ్య. కాని కాసిం రూపాయలకోసం న్యాయాన్ని అమ్మటానికి అంగీకరించలేకపోయాడు.

బసవయ్య పంచాయితీ గుమాస్తాని బ్రతిమలాడి, లంచంపెట్టి చీటీలలో ఒకదానిమీద చిన్నగుర్తు పెట్టించాడు.

తీర్పు సమయం వొచ్చింది. కాసిం కళ్లు మూసుకుని అల్లాను తలచుకున్నాడు. చీటీ తీసుకున్నాడు బసవయ్యకు గుండె దడ దడలాడింది, ఆ చీటీ తనకిస్తాడేమోనని; ఆ చీటీకే వుంది గుర్తు.

కాసింకి చెయ్యి గజగజలాడింది. చేరిన పెద్దలంతా ధర్మదేవత ప్రత్యక్షంకాబోతున్నట్లు ఎదురుచూస్తున్నారు. కాసిం చీటీ బసవయ్యకు ఇవ్వబోయినాడు. బసవయ్య వారిందాగా 'పెద్ద వాడు మా చినబాబుకు యివ్వాలి ముందుచీటీ' అన్నాడు బసవయ్య మంచితనాన్ని మెచ్చుకున్నారు కొందరు.

పన్నెండు వందల రూపాయల గుర్రం బసవయ్యకు వొచ్చింది. నిజాయితీగా నిలబడిన చలమయ్యకు చిన్నతనంగా వుండటమే కాను చచ్చినంత పనయింది. న్యాయానికి పోయి నెత్తికి చేతులు తెచ్చుకున్నానే అని విచారించాడు. కాని ఆ దెబ్బతో అతడికి అపరిమితమైన అభిమానం, పట్టుదల యేర్పడ్డాయి. ఏమయినా ఏడాదినాటికి ఈ చిన్నగుర్రానికి ఆట నేర్పించి పెద్దగుర్రంమీద పందెం వదలాలని నిశ్చయించుకున్నాడు. అయితే అది కాసిం వల్ల కావలసిన పని.

పెద్దగుర్రంతోపాటు కాసింకూడా బసవయ్య భాగంలోకి వెళ్లాడు. వాణ్ణి ఎలాగయినా చీలతీయాలి.

చలమయ్యకు బసవయ్యకు ఏర్పడిన స్పర్థలతో ఊరుకూడ పెద్ద గుర్రంపార్టీ చిన్నగుర్రంపార్టీలుగా తయారయింది.

కాసింకి సహజంగా యజమానంటే విపరీతమైన విశ్వాసం పైగా డబ్బుకు లొంగే ఘటమైనా కాదు. ఎలామరి వాణ్ణి బసవయ్యనుంచి విడతీయటం? ఎంతడబ్బుకు లొంగనివాడైనా సాధారణంగా అభిమానానికైనా లొంగక తప్పదు. కాగా అతని అభిమానానికి తీరని మచ్చకల్పించాలని చూశారు చిన్నపార్టీ వారు.

ఓనాడు బసవయ్య భార్య – సీతమ్మ – కాసింని పిలిచి సాంబారు కారం పెట్టడం చూచారు, చిన్న పార్టీలో కొందరు. సీతమ్మ స్వభావతః కొంచం చనువుగా మాట్లాడే మనిషి. సాంబారుకారం పెట్టడమే కాదు-సరసాలుకూడా ఆడిందన్నారు కొందరు. చేతికందిస్తూ చెయ్యికూడా గిల్లివుంటుందని బుద్ధిమంతులు మరి కొంద రూహించారు.

కట్టుకొద్దీ గాలిపోగుచేసి, సీతమ్మకూ, కాసింకీ సంబంధం వుందని కల్పించింది చిన్నపార్టీ. అది మెల్లిగా బసవయ్య చెవికి సోకేట్లుకూడా చేశారు.

ఎంత విశ్వాసం వుంటేమాత్రం - సందేహం కలగకుండా వుండాలే గాని, కలిగిన తర్వాత యిలాంటి విషయాల్లో చూసి చూడనట్లు ఎలా ఊరుకుంటారు; ఎవరయితే మాత్రం? బసవయ్య కూడా ఈ సందేహంలో తనకు తెలియకుండానే పడ్డాడు. కాని సంపూర్ణంగా విశ్వసించనూ లేకపోయాడు.

ఎనభై అయిదు

అయినా అతడిమీద అయిందానికి కాని దానికీ కారాలు మిరి యాలు నూరటం ప్రారంభించాడు. హఠాత్తుగా బస వయ్యలో వొచ్చిన ఈమార్పుకు అంతర్యం ఏమిటో తెలుసుకో లేక పోయాడు కాసిం.

—బసవయ్య ధాటీకి తట్టుకో లేక పోయాడు. ఈ నౌకరీ మానే ద్దామా అనీ అనుకున్నాడు. కాని మళ్ళీ గడిచే దెలాగా అనీ బెంగ పెట్టుకున్నాడు. దినదిన గండంగా రోజులు వెళ్ళ తీస్తు న్నాడు.

ఈ అదును కనిపెట్టి చలమయ్య కబురు చేశాడు – తన దగ్గ రకు నౌకరీకి రమ్మని. కాని స్వామిభక్తి! చప్పున అంగీకరించ లేకపోయాడు.

బసవయ్య ఒకరోజున పొలంనుంచి వచ్చేసరికి గుర్రాల సావడిలో నుంచి వొస్తోంది సీతమ్మ. కాసిం కోసమే వెళ్ళిందనుకున్నాడు బసవయ్య. ఆమె వెళ్ళింది నిప్పు చేసుకోడానికి పిడకలకోసం. ఏదో లేనిపోని కారణం కల్పించుకొని చెయ్యికూడా చేసుకు న్నాడు, కాసింమీద బసవయ్య.

ఇహ ఆ అవమానాన్ని భరించలేక పోయాడు కాసిం. చల మయ్య దగ్గర నౌకరీకి వొప్పుకున్నాడు. తాము వేసుకున్న 'ప్లాను' అద్భుతంగా ఫలించినందుకు చిన్న పార్టీ అంతా విందు చేసుకున్నారు – చలమయ్య ఖర్చుమీద.

చలమయ్య ఝుమాయించాడు – గుర్రానికి ఆట నేర్పించడంలో. ఆటనేర్పడంలో హంగుకు – డప్పులూ, బ్యాండూను. రకరకాల ఆటలు నేర్పిస్తున్నాడు. రోజూ కనీసం సాయంకాలం రెండు గంటలయినా గుర్రంతో ఉత్సవమే పూరంతా.

బసవయ్య అయినా అంతమాత్రానికి పట్టుదల వదలలేదు. బస్తీ నుంచి మాంచి ఆటగాణ్ణి తెప్పించాలని – పిలిపించాడు మస్తాన్ని.

మస్తాను వచ్చిన కొత్తలో వాడి ముస్తాబును చూడడానికే వొచ్చేవాళ్ళు కొంతమంది జనం. గుర్రం ఆటలో మాత్రం అట్టే మార్పు కనిపించలేదు.

జనాన్ని యెక్కువ ఆకర్షించడానికి – గుర్రాలను ముస్తాబు చేయడం కూడా అవసరమని తోచింది రెండు పార్టీలకు.... ఇహ వాటి వైభవం చెప్పతరంకాదు. ముఖమల్ అంగరఖాలు. ముఖానికి ముత్యాలు కూర్చిన పట్టాలు, రెండుప్రక్కలా వెండి పూతలు పూసిన కళ్ళాలు, ఆడించేటప్పుడు సిల్కుదారాలతో పేనినపగ్గాలు, పట్టుకుచ్చుల కొరడాలు – ఎన్నెన్నో రకాలు చేయించారు.

చలమయ్య విశేషం ఏమిటంటే, పాతిక ముప్పయికాసులు పెట్టి బంగారపు మువ్వ చేయించాడు – గుర్రం మెళ్ళోకి. బసవయ్య మాత్రం సీతమ్మ వారించడం మూలంగా చేయించ లేక పోయాడు.

ఎనభైయేడు

చివరకు గుర్రాలకు వేసే గుగ్గిళ్ళదగ్గర్నుంచీ పోటీలుపడి ఒకరు రూపాయివి వేస్తే మరొకరు రూపాయిన్నరవి వేయటం సాగించారు.

... ... ...

ఓనాడు చుట్టుపక్కల గ్రామాల్లోవున్న పెద్దపెద్ద ఆసాములంతా ఈ గుర్రాల ఆటను చూట్టానికై వొచ్చారు. వొచ్చిన పెద్దలకు రెండుపార్టీలవాళ్ళూ, ముందు టీపార్టీలు చేశారు. ఏగుర్రం అదృష్టం యెలావుందో ఆనాటి ఆసాములమీద ఆధారపడి వుంది. చివరకు ఆటలో చిన్నగుర్రానికి, అందంలో పెద్దగుర్రానికీ బహుమతు లిచ్చారు.

అందానికి బహుమతి రావటంలో మన ప్రయోజకత్వంఏముంది అని చిన్నబుచ్చుకున్నాడు బసవయ్య. తానుకూడా ఇంకో ఆట నేర్పేవాణ్ణి పిలిపించి ఆటలోకూడా మొదటి బహుమతి తన గుర్రానికే రావాలని నిశ్చయించుకున్నాడు. కాని సీతమ్మ అతన్ని హెచ్చులకు పోనీయ లేదు.

"ఇప్పటికయిన అప్పు చాలు; ఆదాయం మాత్రం పామయ్య గారికిలాగా మనకు ఏమీ కనబడటంలా. ఇప్పటికయినా వెనక్కి తిరిగి చూసుకోకపోతే పిల్లలకు ఇంతకొంప్రడ అయినా మిగలదు." అని అతణ్ణివేధించి ఆగుర్రాన్ని ఎల్లాగయితేయేం అమ్మివేయించింది. అప్పటికే బసవయ్యకు అయినకర్చు వధ్నాలుగు

వేలు ... గుర్రం సంపాయించిన ఆదాయం నాలుగు వేలు.

... ... ...

చలమయ్య ... ఇహ ఏకైకవీరుడు. పోటీలో నెగ్గాడు. ఊళ్ళో ఎంతగౌరవం! ఎంతప్రతిష్ట! పొరుగూళ్ళోమాత్రం ఫలానా గుర్రం వీరిదేనని చెప్పుకోరూ! కాని అప్పటికీ ఇప్పటికీ మారని వాడు కాసిమే. గుర్రానికి ఆట బాగా అలవాటయిందన్నా కాసింకి వొచ్చిన మెప్పు లేదు. గుర్రంశరీరాని కున్న అంగరఖా విలువంత లేదు కాసిం జీవితమంతా. విలువ గుర్రానిది. లోకువ కాసింది.

ఆదాయంలో పోటీ పోయింది. చలమయ్య ఇహ తనగుర్రానికి పత్రికల్లోకూడా ప్రకటనలు వేయించాడు. ఈ ఊహ అతడికి చాలారోజులనుంచీ వున్నా, ఆపని బసవయ్యకూడా చేస్తాడేమో, చేస్తే అతడిగుర్రం బొమ్మలో అందంగా కనిపిస్తుందని బెంగెట్టుకునేవాడు. ఎంతోదూరం నుంచీకూడా తన గుర్రానికి ఆహ్వానాలు రావటం ప్రారంభమయినాయి. పోటీ లేదు కనుక రవంత లాభసాటీగా కూడా వుంది యిప్పుడు.

... ... ...

శివరాత్రికి ప్రక్కవూళ్ళో బ్రహ్మాండమైన వుత్సవాలు. గడచిన సంవత్సరం ఇద్దరూ తీసికెళ్ళారు గుర్రాల్ని, చలమయ్య గుర్రం దగ్గర నిలవటానికి జనమే లేకపోయారు.

ఈదఫా తనగుర్రం కేవలం ఆలోటు తీర్చడమే కాకుండా ఇది

ఏస్వర్గంనుంచో దిగివచ్చిందనే ఖ్యాతికూడా తెచ్చింది. అతని ప్రతిజ్ఞ అక్షరాలా నెరవేరింది. ఆ ఉత్సవానికి వొచ్చినవాళ్లలో కొందరు యువకులు ఉబలాటం కొద్దీ ఆగుర్రాన్ని కొందామని మోజుపడ్డారు. అమ్ముతారేమో అని రాయబారాలు సాగించారు...చలమయ్యకూడా మంచిబేరం వస్తే అమ్ముదామనే అనుకున్నాడు. ఏదో పంతానికి ఇన్నాళ్లుభరించాడు గుర్రాన్ని. ఆరువందలకు కొన్న ఆగుర్రాన్ని ఆ బేరగాళ్లు రెండు వేలూ, మూడువేలూ – అంటూ పోటీలుపడి అయిదువేలదాకా ధర పెంచారు..

చలమయ్య యేటూ చలించలా. ఆమోజుగాళ్ళు మెల్లిగా కాసిం దగ్గరకుజేరి ఆగుర్రాన్ని మాకు యిప్పిస్తే వందరూపాయలు బహుమానం–నీకు నెలకు రెట్టింపుజీతం ఇస్తామన్నారు. ఇలా ఇక్కడా పోటీలుపడి కాసిం మనస్సుకు అయిదువందల రూపాయల ధరవరకూ పెంచారు.

కాని కాసిం వొచ్చినవాళ్లను గదమాయించి – అన్యాయం పనులు నేను చెయ్యలేనని వాళ్లను పంపేశాడు.

ఆరువేలకూ దమ్మిడీ తగ్గనన్నాడు చలయమ్య.

అయిదువేల అయిదువందలయితే మేమిస్తాం. అంతకంటె ఎక్కువయితే నష్టంఅని ముందుకు వొచ్చారు ఒకరు. ఇప్పటికిదంతా లాభమైనట్లు.

చలమయ్య చలించలా. వాళ్లే వస్తారు కాళ్లదగ్గరకు – ఈతఫా మళ్లీ వస్తే యెనిమిది వేలకు ఏమయినా తగ్గకూడ దనుకున్నాడు.

అవును వాళ్ల మోజు అలాగేవుంది. కాని వెంటనే ఒప్పుకుంటే అలుసవుతామేమో అన్న అనుమానంతో ఆనాటికి వెనక్కి జారారు.

ఇంటికి తిరిగి వచ్చింతర్వాత – పుట్టింటి దగ్గిరవున్న బూబుకు జబ్బుగావుందని తెలిసి కాసిం ఊరికి వెళ్ళాడు.

ఆరాత్రే గుర్రానికి హఠాత్తుగా జబ్బు చేసింది.

గుగ్గిళ్లు వాసనైనా చూడలా. గడ్డి కరవనే లేదు. నీళ్లు ముట్టుకో లేదు.

కాసింమీద బెంగపెట్టుకుందేమో అనుకున్నారు.

దిష్టి తగిలిందేమో అనీ అనుకున్నారు.

కాసింకోసం–ఒకమనిషినీ, బస్తీ డాక్టరుకోసం ఒకమనిషినీ పంపాడు.

తెల్లవారేసరికి గుర్రానికి పొట్ట వుబ్బింది.

డాక్టరు వొచ్చేసరికి–గుర్రం చావుబ్రతుకులమీద వుంది. కాసిం రాలా. భార్య అక్కడ చావుబ్రతుకులమీద వుంది.

ఎన్ని ప్రయత్నాలుచేసినా లాభం లేకపోయింది. ఆరువేల రూపాయల గుర్రం అయిదునిమిషాల్లో ఎగిరిపోయింది.

తొంభై ఒకటి

చలమయ్యకు తల తిరిగిపోయింది. మొన్న సాయంత్రం అమ్మితే అయిదువేల అయిదువందలు వొచ్చే గుర్రం—ఇప్పుడు యాభై రూపాయల విలువైనా లేకుండా పోయింది.

"ఒకవేళ ఇంత అకస్మాత్తుగా గుర్రం చావటానికి కాసిం ఏమయినా చేసివెళ్ళాడేమో? లేకపోతే గుర్రానికి యింత జబ్బుగా వుండటంటే ఎందుకురాదు? బహుశా ఈ పని బసవయ్య దగ్గర లంచం తినో, లేక ఆ బేరగాళ్ళదగ్గర ఏమాత్రమో కక్కుర్తిపడో చేసివుంటాడు."

దూరదృష్టిగల కొందరు చలమయ్యకు సలహా యిచ్చారు.

ఇహనేం గుర్రంవల్ల డబ్బురాలా చలమయ్యకు. అది చచ్చే సరికి 'అక్కుసు' మాత్రం వొచ్చింది.

'మందుపెట్టడంవల్ల చచ్చిపోయింది గుర్రం'అని డాక్టరుకు అయిదువందలిచ్చి సర్టిఫికెట్ తీసుకున్నాడు.

దాన్ని ఆధారంగా చేసుకొని, బసవయ్యనూ, కాసింని, ఆనాడు గుర్రాన్ని బేరం అడిగినవాళ్ళనూ, పాతవిరోధుల్ని అందరిని కలిపి ప్రతివాదులుగా చేసి కోర్టుయెక్కాడు చలమయ్య—పగంపూరును సాక్ష్యానికి కొన్నాడు.

వెయ్యిరూపాయల లంచంతో బసవయ్య వదిలించుకున్నాడు కేసు. బేరగాళ్ళూ అదేవిధంగా తప్పుకున్నారు.

కొంతకాలం

కాని చివరకు కాసింమీద నిల్చింది కేసు...

ఈఉన్నదికూడా పోతుందేమో? మర్యాదగా ఎత్తేసుకోరాదా కేసు అనిసలహా యిచ్చారు కొందరు చలమయ్యకు. హైకోర్టు అయినా చూస్తాకాని కేసు వదలనని – పట్టు పట్టాడు.

చివరకు చలమయ్య ఆస్తికి (కావడిచుట్టి; యీ పాపం – ఏ పాపం యెరుగని కాసిం మెడకు చుట్టుకుంది.



# చైత్రం

చిరాకుగా వున్నానేమో, సిల్కులాల్చీవిప్పి, పక్కకు విసిరే సరికి......

"ఔను, ఇంక మీకు మేము కనపడతామా!" అంది ముఖం మీద పడిన లాల్చీని తొలిగిస్తూ.

ఎదటఉన్న వ్యక్తి కూడా కనిపించనంతటి గర్వం ఏంవొచ్చిందా అనుకున్నాను. ఆమె కిటికీతలుపుల కీ నీడలోవుంది

..."అంత మరీ కన్పించక పోవడానికి... నా కళ్ళద్దాలేమయినా మారాయనుకున్నావా?" అన్నాను నేనుకూడా పక్కనే సోఫాలో కూర్చుని నవ్వుతూ

"అద్దాలు మారకపోయినా ఫ్రేములు మారవచ్చుగా... సరదాకు" అన్నది నామాటనే సాగదీస్తూ.

"ఔను, నిజమే, నువ్వు చూస్తున్నప్పటి నుంచీ ఎన్ని రకాల ఫ్రేములు మార్చాననీ—అలా అడుగుతున్నావు? అంతేనా లేక కవిత్వమేమయినా మాట్లాడుతున్నావా?"

"ఏం?, మాట్లాడినా మాట్లాడవచ్చు! సహవాసదోషం ... ఇంతవరకు మార్చక పోయినా—ఎప్పుడూ ఒకలాగనే వుంటావనే నమ్మకమేమిటి?"

"ఎప్పుడూ లేనిది, ఇంతలోనే నామీదంత అపనమ్మకం కలగ టానికి కారణమేమిటి? ఎంతసేపటికీ చదరంగపు ఎత్తుల సమా ధానా లేకాని; అసలు మనస్సులోని సంగతి మాత్రం తేల్చి చెప్పవుకదా!"

"ఆఁ... అలాంటిదేముంది?... ఏంలేదు ... సరేకాని, ఇవాళ ఇంత ఆలస్యంగా వచ్చావేం?"

"నా ఆలస్యానికేనా యీ హంగామా! ఉహుఁ... మనస్సు లోని విషయాన్ని మాత్రం మాటుగానేవుంచి ప్రసగం మార్చావు అవునా?"

"నామనస్సులో వేరేవున్నా లేకపోయినా—అసలు నీలోనే యేదో అనుమానం ఉన్నట్లుగా వుండే......అట్టే వేధించక వెంటనే తేల్చి చెప్పరాదూ?..."

"నాఅనుమానం...బహుశా అపోహయేమో!... అపోహ కొద్దీ ఏమయినా తొందరపడి అంటే — నాకు నేనై అమంగళం మాటలు మాట్లాడిన వాణ్ణవుతానేమోనని ... కాని—"

—అంటూ లేచి, దగ్గరనే టేబిల్ మీది సిగరెట్ టిన్ను తీసు కుని, దాని క్రిందనేవున్న పసుపుపచ్చ కవరు కూడా అందు కొని, "ఎప్పుడువచ్చింది కవరు"? అడుగుతూనే, మూత సగం

కోసిం, గాలివిసురుకు కవరు చించివుండడం గమనించి —ఉత్తరం తీసి, పైపంక్తులు – ఉపోద్ఘాతం చదివానో లేదో;

“ఏం? ఇంక నేను—కనీసం—జ్ఞాపకమైనా వుంటానా?” అన్నది జాలిగా నా మెడకు చేతులుపెనవైచి.

“ఏం?”

“ఇంక నేను చెప్పేదేముందీ? చేతిలోనేవుందిగా కవరు, అయినా నేనెందుకూ మధ్యలో...?” అంటూనే చేతుల్లోంచి మెలకువగా తప్పించుకొని;

“ఇంక వొచ్చేవసంతంలో మల్లెపూలు మచ్చుకయినా మాలాంటి వాళ్ళకు దక్కనీయవు కాబోలు!” అంటూ చెంగున దూసుకు పోయింది ఇంట్లోకి.

—మామూలుగా సాయంకాలం, బయలుదేరబోతూంటే, లోపల గుమ్మంలోనే యెదురై —

“మీకిక్కడ బందిఖానా తప్పదు. మీ అమ్మగారు చీకటిపడితేనేకాని రారు.” అంటూ టీ కప్పు అందించింది.

టీ సేవిస్తూ వుండగా—

“ఇంక బహుశా మేం ఈవూరునించి వెళ్ళిపోవాల్సి వొస్తుందేమో” అన్నది దిగులుగా.

“ఆఁ. వెళ్ళిపోతావా?” అని వొడిసిపట్టుకుని, “ఊఁ. ఇంక ఎలా వెళ్ళిపోతావూ?”

శొం కై అ ర

అంటూ అంతలోనే ఆమెచేతిలో మడతపెట్టివున్న కవరు లాక్కుని, ఆ సంగతి ఏమయినా అందులో వున్నదేమోనని ఆదుర్దాగా చదివా.

"నువ్వు చెప్పిన సంగతి యీ వుత్తరంలో లేదేం?...అబద్ధాలు చెప్పి నన్ను ఉడికిలించాలని సరదా నీకు?"

"అవును. మరి, నాకు ఏ సరదా అయినా నీతోనేగా! కాని ఇది సరదాగా అన్నమాట కాదు మూర్తీ! ఇన్నాళ్లు శెలవు పెట్టారు కనుక, బహుశా ట్రాన్సుఫర్ అవ్వతుందేమో నని...! అలాగే కనక అయితే...!!

అంటూ అరచేతుల్లో ముఖం దాచుకుంది.

"ఏమిటది ? అయినప్పటిమాటకదా! అందుకోసమని ఇప్పుడిలా ముందుగానే——..."

అని ఓదార్చబోతూ ఆమె ముఖం పైకెత్తాను. ఆ కళ్లల్లో అశ్రు వులు రవంతసేపు తొణికిసలాడి...

అతి జాలిగా నా ముఖంవైపు చూస్తూ;

"అమాయకుడివి – అర్థంకాదు నీకు నా బాధ – అయినా నీ మనస్సుకూడా..."

——చెప్పలేకపోయినా అంతవరకు గాద్గదికంతో చెప్పి, 'ఎవరో

తొంగి చూస్తూ

వొస్తున్నట్లున్నారు' అంటూ తప్పించుకొని వెళ్ళిపోయిందే కానీ పూర్తిగా అప్పుడూ చెప్పలా.

—ఆమె, చెప్పలేని బాధమాత్రం పడుతోంది మనస్సులో. అయినా తోణకదు. పైగా—నే నెక్కడ తన సంగతి గ్రహిస్తానో అని - లాలనచేస్తూ మరపించాలని కూడా ప్రయత్నిస్తుంది.

వచ్చాక వరుసంగతి-ప్రసంగవశాత్తూ తెచ్చి-ఏవేవో క్రొత్తక్రొత్త విషయాలు ఉవ్విళ్లూరేట్లు చెప్పి, అపూర్వానుభవాలు నాకేదో కలుగబోతున్నట్లు ఆశలు కల్పించి, అలాంటప్పుడు నేను జ్ఞాపకమయినా వుంటానా?' అని సహజమయిన బేలతనం చూపిస్తుంది...

మళ్ళీ...'నీ ఆనందానికి విఘ్నంలేకుండా మాకు ట్రాన్సుఫర్ అవటంకూడా ఒకరకంగా మంచిదే'అని సమర్థించటానికి ప్రయత్నిస్తుంది.

ఆమె మాటలు వింటున్నంతసేపూ - అపూర్వమైన ఆనందమూ, ఉత్సాహమూ, ఉద్రేకమూ కలుగుతాయి. మళ్ళీ. మధ్యలో ఏదో తెలియని బాధ - దిగులూకూడా...!

—ఏమిటో! నాకు నేనే అర్థంకాని స్థితిలో ఉన్నా.

—మా అనుమానానికి తగినట్లుగానే ఆయనకు బదిలీఅయింది...

ఇన్నాళ్లు సెలవుపెడితే ఒకవేళ ట్రాన్స్‌ఫర్ కావచ్చు కన తెలిసికూడా ఆయనలా ఎందుకుచేశాడా అనిపించింది. ఆయనకు ఈ వూళ్ళోవుండటం ఇష్టంలేదా?... ఒకవేళ ఆమె నాతో అన్నట్లుగానే - ఈ ట్రాన్స్‌ఫర్ ఆమె సలహా ననుసరించి చేయించుకోటానికి ప్రయత్నించలేదు కదా!

ముందు ఆయన వెళ్ళి ఆ కొత్త ఊళ్ళో ఉద్యోగంలో ప్రవేశించాడు.

తరువాత కొద్దిరోజులకు ఆమెకూడా వెళ్ళక తప్పిందికాదు సామానుతోపాటు.

వెళ్ళేరోజున—

"లోకం మెచ్చి అనుకున్నా - ఇక్కడ వున్ననాళ్లూ నా జీవితంలో... మధురక్షణాలు గడచిపోయాయి. ఇకముందు నీ జీవితంలో మధురాతిమధురములైన క్షణాలు రాబోతున్నాయి. నేను మెల్లిగా తప్పుకుంటే, నువ్వు సంపూర్ణమైన ఆనందానుభూతిని - పొందగలవనే సంతృప్తితో - కావాలని కోరి - ఇలా ట్రాన్స్‌ఫర్ చేయించుకోటానికి ప్రయత్నించాను. కాని ఇలా అంటే ఎవరూ నమ్మరుకదూ! నామీది వ్యామోహంతో ఆమెను మాత్రం అలసంగా చూడకు. అనుక్షణం ఆనందానుభూతిని కలిగించే అర్ధాంగి సుమీ ఆమె! అంతేకాదు. నీకు నేను ఇవ్వలేని - ఇవ్వలేకపోయిన - అపూర్వమయిన అను

తోం శైలో మ్తిది

భూతిని ఆమె ఇవ్వకలుగుతుంది. నిజానికి నువ్వా ఇంకా పసివాడవు. ఆదర్శాలకోసమని, అయాచితంగా వొచ్చిందే కదా అని – అలసతతో ఆ అమృతాన్ని వొలకపోసుకునేవు సుమీ! నన్ను రవంత మరచిపోకుండా వుంటే చాలు నాకదే పదివేలు..."

అంటూ ఆత్మ విశ్వాసంతో చేతిలో చెయ్యివేయించుకుంది.

—ఇన్నాళ్ళూ ఆమె అనుభవించిన, ఆవేదనా, బాధా – అందులో నాలుగోవంతయినా; నేను ఆమె వెళ్ళింతర్వాతకూడా అనుభవించలా.

అప్పుడే – ఇక్కడ వున్నప్పటికీ – అంతబాధ పడిందే! ఇంక నే నసలు కనపడనుకదా – ఇంకెంతబాధ పడుతూ ఉంటుందో అన్న ఆలోచనకూడా కలగలా నాకా క్షణంలో...

కానుమరి! నాకేదో పెద్ద ఆశాజ్యోతి–మసకగానైనా రవంత దూరంలో కన్పిస్తూనే వుందిగా!

ఆ అనుభూతికోసం, నా మనస్సు రెపరెపలాడసాగింది

అంతమాత్రాన పాత వ్యామోహమూ పోలేదు. కాగా మనస్సు పాత – కొత్తల మధ్యలోపడి నలిగిపోతున్నది.

మళ్ళీ మరో అనుమానంకూడా కలకవేసేది.

రాబోయే అమృతాన్ని ఆశించి, చేతిలో ఉన్నది అమృతం కాదనే అజ్ఞానంతో వొదులుకున్నానేమో...!

అయితే ఈ అనుమానం ఆ ఆశాజ్యోతిలో అంతర్లీనమయి,
అప్పుడు నన్నంతగా బాధించలా.

ఇలా కొన్నిరోజులు మాత్రం పిచ్చిపిచ్చిగా గడిచాయి.

ఆమె వెళ్ళిపోయిందని విన్న ఇరుగు - పొరుగువారు మాత్రం
నే నేదో విషసర్పంనుంచి విముక్తుణ్ణయినట్లు భావించి—

"అవును అశుభమూ శుభమూ యెరుగని - అమృతంలాంటి పిల్ల -
ఆ అమాయకురాల్ని వదలి; ఇంట్లో అద్దెకున్నారు కదా అని-
ఎల్లకాలము దానితోనే పడివుండడానికి అతను మాత్రం అంత
అజ్ఞానుడా? ఏదో పశుచుతినవు బులబాటంకనుక కొన్నాళ్లు
అదో ముచ్చట..."

అంటూ సమర్థించ సాగారు.

పాతసంవత్సరం వెళ్ళిపోయింది.

చైత్రంతో ప్రకృతిలో అపూర్వమైన శోభ, మార్పువస్తాయి
కదా! నేనుమాత్రం ప్రకృతికి అతీతుణ్ణా...! ఇంక నా ఉత్సా
హానికీ, ఉద్రేకానికీ అవధిలేకుండాపోయింది.

మధురక్షణాలకోసం అనుక్షణాలు లెక్కించా.

ఎలా అయితే యేం?

మూహుర్తాల ముచ్చటలూ... గడిచాయి'

కాని ఎలాగడిచాయో తెలియదు.

తిరిగి వొచ్చాను.

మాట ఒకటి

కళ్ళు తెరిచాను—

నా క్రొత్త ఫ్రేములో నించి అంతా వింతగానే కన్పిస్తోంది.

క్రొత్త... అనుభూతి...

మధుర క్షణాలు ... హుఁ. మధురాతిమధురమైన క్షణాలు...

ఈ మధురత్వం నా ఊహల్లోనూ, మాటల్లోనూ తప్ప—మరి మచ్చుకైనా కన్పడదలా.

మార్పులయితే కన్పిస్తోంది. కాని అనుకోని మార్పు.

అది చైత్రమని నేను భ్రాంతి పడానేమో!

లేకపోతే పచ్చని ఆకయినా కన్పించని ఆచిచ్చుల పిడుగుల ఎండలేమిటి?

శరీరమంతా సెగలూ—పొగలూ...

మల్లెపూవు తగిలినా మాడి పోతున్నది.

ఏమిటో...!

వెనుక ఆమెచెప్పిన ప్రతి అక్షరము జ్ఞప్తికివొచ్చింది. ఆమెతో గడిపిన ప్రతి క్షణమూ మాత్రం ఎలా జ్ఞప్తికిరాకుండా ఉంటుంది?

వృథాఆశలు కల్పించి, ఆమె అన్యాయంచేసి వెళ్ళిపోయిందా?

ఆమెదగ్గరవున్న అతి చనువుకొద్దీ అలా అనుకుంటున్నా కాని

నిజానికి ఆమె ఏంచేసింది!

ప్రకృతిలోని సహజత్వాన్ని చెప్పింది. కాని ఈ వైపరీత్యం పాపం! ఆమెమాత్రం వూహించిందా?

అనుభవంలోకి వొస్తున్నా, క్రమక్రమంగా ఆ మాత్రం ఊహించుకోలేనూ? ఊహించే దేమిటి? ప్రత్యక్షంగా కన్పిస్తూంటే!

ఈ నాస్థితి ఆమెకు తెలిస్తే—

ఏమవ్వుతుందో ఊహించగలను. కాని ఇది విన్నమీదట ఆమె స్థితి మళ్ళీ తలచుకుని మనస్సునుమాత్రం ఆపుకోలేనేమో—!

అవును, ఎంతఇదయినా నామనస్సు మాత్రం మరీ అంత పాషాణమా?

ఇంక ఇలాంటి ఆలోచనలు ఎన్నైనా కలుగుతాయి. నాకేకాదు. అలాంటప్పుడు సాధారణంగా ఎవరికైనా అంతేనేమో!

మానసిక బాధకు మందనేది ఎటూ లేనేలేదు.

శారీరక బాధ అయినా తగ్గించుకుందామని—ఇహ తప్పనిసరిగా అభిమానాన్ని వదలి, డాక్టరు దగ్గరకు వెళ్ళాను.

మూడురాత్రుల ముచ్చటలకు ఫలితంగా, 'సాల్వరసన్' నరాల్లోకి గ్రుచ్చుతూ, సింగురు మనేట్లు ప్రశ్నిస్తున్నాడు డాక్టరు నెమ్మదిగా;—

"ఎవరు నాయనా ఆ మహా ఇల్లాలు?"

మా ట మా డు

# నాందీశ్లోకము

కాక్‌టెయిల్ తాలూకు కనరు అణువు అణువునా వ్యాపించి నరాలు జివ్వున లాగుతున్నాయి. టేబిల్ దగ్గర్నుంచి లేచే సరికి శరీరం తేలిపోవడం ప్రారంభమయింది. పాదాలు తిమ్మిరెక్కినట్లుండి అడుగులు తిన్నగా పడటంలేదు. గాలి గొట్టిన ట్యూబులాగా గాలి విసురుకు కదులుతున్నాడు మధు.

తాను తినలేకపోతే త్రాగుడు తననవాలు తింటుంది అని ధర్మశాస్త్రం తినటము అన్నచోట శాకాహారంకంటె అన్నము అని శాస్త్రకారుల వ్యాఖ్యానం. ఇవాళ రవంత క్రైమా అయినా తినందే శరీరం స్వాధీనంతప్పేట్లుగా వుందే అనుకుని మధు మెల్లిగా కాకాహోటలుకు చేరాడు.

పాతవైరాలు పెంచుకొని ఒకర్నొకరు "క్రైమా చెయ్యాలి" అని అనుకునే జనవ్యవహారం మాత్రమే తెలుసు మధుకు ఈ వరకుదాకా. ఇవాళ అదేదో రుచి చూడాలని యోచనం తనలో తనకే వింతగా తోచింది.

ఫోర్స్‌తో తీసుకున్న క్రైమా కాస్తా పెదవిదాకా పోనిచ్చాడు. కాని వొళ్ళంతా గగుర్పొడిచింది.

మనస్కరించక అది ఒక వైపుకునెట్టి—కల్లు రొట్టె విసా తిందామని తెప్పించాడు. అదీ సయించక—ఎంగిలి రొట్టెలకోసం మొగబడ్డ కుక్కకు పారేశాడు,

కైమా తినటానికే కాదు. చెయ్యటానికైనా చాలినంత కైపు ఎక్కిన సోదర **తుల్యులు** ఎంతోమంది పోగయినా రక్కడ. ఆ మైకంలో బల్లలు విరగ తన్నుతున్నారు. కప్పులు పగలు కొడుతున్నారు.

ఇలా వొచ్చినవారిని విచ్చలవిడిగా అల్లరి చేయనిచ్చి, ఇవరకు నాలుగు పచ్చకాయితాలు పుచ్చుకోవటం కాకాకు పరిపాటయింది.

మధు అక్కడినుంచి లేచి వీధిలోకి వొచ్చాడు. రిక్షావాడు పొద్దున్న పెట్టె దుకాణంవాడి వద్ద అణాయిచ్చి కొనుక్కున్న వాటిలో ఆఖరిచుట్ట మూడోసారి వెలిగించి దమ్ము లాగుతున్నాడు తీవిగా. మధు వాలకం చూసి, మంచి బేరం తగులుతుందని గ్రహించి, ఆచుట్ట ఆర్పి చెవులో దాచుకొని ''యెక్కండి సార్'' అన్నాడు.

రిక్షాయెక్కి స్పెన్సర్ సిగార్ వెలిగించాడు మధు. అతడి కళ్ళకు వెలుతురు గిట్టడంలా. కళ్ళు జిగాల్ మన్నాయి. పురపాలక సంఘంవారు వారి ధర్మమా అని బజారుదీపా లార్పారు.

వీధి వెంట నడిచేవారు, హోటల్లోని గల్లంతును చూచి, "చనువు

కున్న వారుకూడా, ఈరోజుల్లో మరీతాగి తందనా లాడ్డాని కలవాటుపడ్డారు. కావలసిన కరెన్సీ దేశంలో కనపడుతున్నం దుకు వచ్చిన రియాక్షన్ ఏమో ఇది" అనుకుంటూ పోతు న్నారు. అంతేకాని కడుపులో మాడే హాలాహాలానికి కన్ను గప్పాలని తాగుతున్నారేమో కొందరయినా యీ చేదంతా అన్న ఊహ తోచలా ఎవరికీ.

ఈమాటలు మధుచెవిని పడ్డాయి. హృదయం కలుక్కుమంది. ఎంత మైకంలోవున్నా ఏదో "గిల్టీ కాన్షన్స్" గిల్లినట్లు మనస్సుకు తడుతూనే వుంటుంది.

ఎక్కడికి అని అడక్కుండానే రిక్షావాడు బయలు దేరాడు. ఇలాంటి బేరాలు రోజుకో రెండైనా దొరక్కపోతే, పూటకు కనీసం రెండు శేర్లయినా ఉడకాల్సిన రిక్షావాడి కుటుంబం యీ కేవనింగు రోజుల్లో యేమయిపోవాలి ?

చిల్లులుపడ్డ ఆకాశంలోనుంచి ఆలోకంలోని దీపాలు కాబోలు మినుకుమినుకు మంటున్నాయి.

ఆకు చప్పుడయినా లేక అంతరాళం హాయిగా నిద్రిస్తున్న ఆ నిశ్శబ్దంలో, అంతరాత్మలో ఏదో పోరు ప్రారంభ మయింది.

తన నిశ్వాసల్లోంచి వొచ్చే ఆవిరికి కాబోలు ఆకాశం ఊపిరి పెట్టినట్లుయి ఘగ మసలుతోంది.

మా ట ఆ రు .

అతడి కనుకొలకుల్లో మెరుపు ఆరుద్రానక్షత్రంలో ప్రతిఫలిస్తోంది.

అంత దూరానవున్న నక్షత్రాల నడకల కనుగుణ్యంగానే వుంటాయిట! భూమిమీద మానవుల పరిణామాలు ఎంత దుస్థితిలో వున్నా మానవుని కింతవరకు ఏ నక్షత్రమూ ఉపకరించిన పాపాన పోయినట్లు లేదు—ఎంతసేపటికి తన అడుగు నీడల్లో సంచరించేట్లు చెయ్యాలని ప్రయత్నించటమే కాని. అవును నక్షత్రాలు కూడ స్త్రీ జాతికి చెందినవే కదూ?

కళ్ళు కూరుకుపోతున్నా పెళ్ళిలో పురోహితుడు అరుంధతీ నక్షత్రాన్ని మాత్రం చూపకమానడు. ఆమెచుట్టూ కాపలా వున్న యేడు పుంలింగాల జోలి యెవరికీ పట్టదు.

అరుంధతి భర్త అని వశిష్ఠుడని పేరు తప్ప, మిగిలిన ఆరుగురు పేర్లు కాని, వారి భార్యపేర్లు కాని తెలియవు చాలా మందికి. యెంచేతో మరి!

అరుంధతి-పోనీ, తన అసమాన పాతివ్రత్య ప్రభావంవల్ల అంత ప్రాధాన్యం సంపాయించుకున్నదేమో అనుకుందాం, అయితే లోకధర్మం-కాని వాళ్ళనేగా యెక్కువగా చెప్పుకోటం!

పోనీ తగుదునమ్మా అని ప్రతిపెళ్ళిలోనూ అంతప్రాముఖ్యాన్ని వహించే, ఆ అరుంధతీ అమ్మవారు తన దర్శనంకోసం వచ్చిన ప్రతి కన్నెపడుచునీ అంతదూరాన్నుంచీ దీవించిందీ!

నూ ట యే డు

ఆమహా ఇల్లాలి దీవెనలు అన్నీ అమోఘం అయినట్లు రుజువు ఏమయినా ఉందీ?

అదుగో వినిపిస్తోంది యెక్కడినుంచో సన్నాయి శ్రుతిమళ్ళీ. ఎవరిమెళ్ళోనో, యెవడో మూడుముళ్ళూ వేస్తున్న ముచ్చట కాబోలు ఆ సన్నాయి. తెగ్గోస్తేనే కాని విడిపోవని తెలిసి కూడా యెందుకో అలా వేస్తారు పీటముళ్ళు. లాగూ ముడివేసు కోటం చేతకాని పిలకూనకూడా "పీటముడి వెయ్యొద్దు" అని హెచ్చరిస్తాను మరి!

రిక్షావాడు తనచిత్తంవొచ్చినట్లు వీధులన్నీ తెగతిప్పుతున్నాడు— ఓపిక ఉన్నంతవరకు. ఆ సన్నాయి హృదయాన్ని సారకోత కోస్తున్నట్లుంది. సంగీతం ఆనందాన్ని యెలాఇస్తుందో — బాధను కూడా అలాగే కలిగిస్తుం దల్లేవుంది.

విషం ప్రాణాన్ని తీస్తుంది. ప్రాణాన్ని ఇస్తుంది.—అబ్బా!

మనస్సు వున్నదో అతడి హృదయంలో మండే మంటకు మసి అయిందో తెలియటంలేదు. ఇప్పు డీ కాక్‌టెయిల్‌తో — తృప్తి పడ్డ అగ్నిహోత్రుడేనా వివాహంలో అయిదురోజులూ ఔపాస నాదుల్లో ఆజ్యంతో తృప్తిపడే అగ్నిహోత్రుడుకూడా? ఔను, అంతా ఒకటేజ్వాల! మహాజ్వాల!

బుద్ధి బగ్గిఅయినట్లుగానేవుంది, చేతిలోనిచుట్టతో వేళ్ళుచురుక్కు మన్నాయి. విసిరిపుచ్చుకు పారేశాడు.

జేబులో సీసాలో అంతో యింతో మిగిలింది కూడా పుచ్చుకున్నాడు. నీలకంఠుడు ఒక్కసారి పుచ్చుకున్నదే గుటక వెయ్యలేకపోతే గొంతులో గడ్డకట్టింది. ఆ వేడికి ఆగలేక నేగా గంతులు వేశాడు. అప్పుడు యేర్పడిన గంగ సంబంధాన్నే ఈనాటికి వదల్లేకుండా ఉన్నాడు.

ఆ కంటిమెరుపే తగ్గలా. ఈనాటికి మధుజీవితంలో అనుక్షణం మింగే చేదు ఈ కాక్‌టయిల్‌తో సహా ఏ మూల ప్రజ్వరిల్లుతోందో !

ఎక్కడికి వెళ్లాలో అతడికి ఆలోచన లేదు. భూమిమీద రిక్షా తిరుగుతున్నదో, రిక్షాచుట్టు భూమి తిరుగుతున్నదో కూడా అతడికి స్పృహ లేదు.

అర్ధరాత్రి దాటినా అతడి తిరుగుడి కంతు లేకుండావుంది. సంప్రదాయంగా వొచ్చిన అతడిలోని స్వచ్ఛమయిన రక్తంతో ఈ కాక్‌టయిల్ అంతర్లీనంకాలేక సుళ్ళు తిరుగుతోందల్లే వుంది. మహోదయం నాటి సముద్రపు హోరులాగా మరి ఆ హోరు యెక్కడిది మనసులోను ?

ఆహితాగ్నులు, ఆర్షవేత్తలు అయిన అతడి పూర్వులు ఆకాశంలోంచి ఈ వైఖరి గమనిస్తున్నారేమో! అయిన వంశానికి కళంకం ఆపాదింపచేస్తున్నాడని వాపోతున్నారేమో ?

ఎవరి మానాన వారుపోతారని ఊరుకోక యెందుకు మనువు

బండెడు శ్లోకాలు త్రాళ్ళలాగా పేనాడు! పాపం! ఎంతమందిని బంధింపగలిగాడు నిజానికి!

రిక్షా తన వీధిలోకే వచ్చింది. ప్రేత భూమిలో భూతనాథుడి ప్రళయతాండవ ధ్వనిలాగా అతడి హృదయంలో ఆరాటం ఎక్కువయింది.

కాక్‌టయిల్ వాసన కళ్ళల్లోంచికూడా కొడుతోంది. తన గుమ్మంవద్దనే ఆగింది రిక్షా. అవును నిజమే! తనగుమ్మమే. రిక్షా దిగి అయిదు రూపాయల కాయితం వాడి మొహాన విసిరేసి తలుపు తన్నాడు.

వాడాకాయితం దీపం వెలుతురున ఎగాదిగా చూసుకొని సీటుక్రింద పెట్టెలో భద్రంగా దాచుకుంటూ అన్నాడు:

"భలే కాతాపట్టారు స్వామి! బంగారబ్బొమ్మ!"

# దేశీ ప్రచురణలు



## శరత్ రచనలు

| | | | |
|---|---|---|---|
| చరిత్రహీనులు (రెండు భాగాలు) | 5 | 0 | 0 |
| శరత్ కథలు (మూడు భాగాలు) | 3 | 0 | 0 |
| గృహదహనమ్ (రెండు భాగాలు) | 3 | 0 | 0 |
| శేషప్రశ్న | 4 | 0 | 0 |
| సుభద్ర | 2 | 0 | 0 |
| పూజారిణి | 1 | 8 | 0 |
| ఆడబ్రతుకు | 1 | 0 | 0 |
| స్వామి | 1 | 0 | 0 |
| కాశీనాథ్ | 0 | 8 | 0 |
| నెత్తురు చుక్కలు (శివరామకృష్ణ) | 1 | 0 | 0 |
| వీరవల్లడు (విశ్వనాథ సత్యనారాయణ) | 1 | 0 | 0 |
| దేశద్రోహి (పి. వి. సుబ్బారావు) | 0 | 12 | 0 |

వెలయువారు :

దేశికవితా మండలి, బెజవాడ.

# సార్సామృతము డిపో

గవర్నరుపేట, బెజవాడ.

(శాస్త్రోక్తమైన ఆయుర్వేద ఔషధములకు పుట్టినిల్లు.)

డాక్టరు: కంభంమెట్టు విష్ణువర్ధనరావుగారిచే

తయారుకాబడిన

అయోడైజ్డ్

## (1) సార్సామృతము (రిజిష్టర్డు)

ఈ సార్సామృతము చెడురక్తమును శుద్ధిపరచి పరిశుద్ధముగ చేయుటలో అమోఘమైనది. అతి మేహమువలనను, రక్తమువలనను కలుగు మేహ వ్రణములు, నెత్తురుగడ్డలు, రాచకురుపులు, తీట, గజ్జి, దురద, తామర, మొదలగు చర్మవ్యాధులను, అరికాళ్లు, అరిచేతులు మంటలు, గనేరియా, సవామేహములను రూఢిగ పోగొట్టును

8 ఔన్సుల సీసా రు 2-4-0. 4 ఔన్సుల సీసా రు. 1-4-0.

## (2) రేచన (రిజిష్టర్డు)

ఈ లేహ్యమును రాత్రి పరుండబోయినప్పుడు వేసుకొనిన తెల్లవారుసరికి ఒకటి లేక రెండు సుఖవిరేచనములగును. ఇందు నేపాళము కలిపియుండలేదు. వాంతులు కావు, రుచిగానుండును.

సీసా రు 1-0-0. మోతాదు రు 0-1-6.

# దేశీ ప్రచురణలు



## రాజకీయ పుస్తకాలు

| | |
|---|---|
| గాంధీ ప్రణాళిక (అగర్వాలా) | 1 12 0 |
| గాంధీ రాజ్యాంగం | 1 8 0 |
| రైతులు కమ్యూనిస్టులు (రంగా) | 1 8 0 |
| జాతీయ విప్లవపంథా (రంగా) | 1 8 0 |
| పాకిస్థాన్ (రంగా) | 0 8 0 |
| నిర్మాణ కార్యక్రమము | 0 8 0 |
| విద్యార్థి నిర్మాణ కార్యక్రమము | 0 8 0 |
| కాంగ్రెసుకే మీ ఓటు (పట్టాభి) | 0 10 0 |
| ఝాన్సీలక్ష్మీబాయి | 1 4 0 |
| అరుణ అసఫాలీ | 0 12 0 |
| ప్రజానాయకుడు ప్రకాశం | 0 12 0 |

**వలయువారు :**

## దేశికవితా మండలి, బెజవాడ.

She's safe, Baxter.